# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు.వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

Internet Archive: Digital Li ×

https://archive.org

INTERNET ARCHIVE

Web Video Texts Audio Software About Account TVNews OpenLibrary

Universal access to all knowledge

Donate | Store | Blog | FAQ | Jobs | Volunteer Positions

Search: All Media Types Advanced Search Hello Komireddy (not you? sign in or log out) Upload

**Announcements** (more)

Millions of historic images posted to Flickr

Zoia Horn, librarian and activist, dies

Working to Stop Rewriting Copyright Laws via TPP Treaty

**Web** 426 billion pages saved over time

INTERNET ARCHIVE WaybackMachine http:// BROWSE HISTORY

**Welcome to the Archive** RSS

The Internet Archive, a 501(c)(3) non-profit, is building a digital library of Internet sites and other cultural artifacts in digital form. Like a paper library, we provide free access to researchers, historians, scholars, the print disabled, and the general public.

**Video** 1,721,625 movies — Browse (by keyword)

Curator's Choice (more)

Noveltoon: The Stupidstitious Cat

A very superstitious cat tries to catch Buzzy for breakfast but Buzzy outsmarts him. Animation by...

Recent Review

Little Ol Bosko In Bagdad

Average rating:

**Live Music** 131,731 concerts — Browse (by band)

Curator's Choice (more)

Yarn Live at Towne Crier Cafe on 2014-02-16

01. intro 02. Time Burns On 03. I Hate You 04. Down On Your Luck 05. Lost Cause 06. Christopher...

Recent Review

Grateful Dead Live at Merriweather Post Pavilion on 1985-06-30

Average rating:

**Audio** 2,095,303 recordings — Browse (by keyword)

Curator's Choice (more)

contra32: Infex - Type-E

How exactly does one create a golem? Although there are many variations in recorded methods and...

Recent Review

KM/TB Sol Rezza 2014

Average rating:

**Texts** 6,509,320 texts — Browse (by keyword)

Curator's Choice (more)

The Orchid world. A monthly illustrated journal...

No more published

Recent Review

الأسطوانة الرابعة 04 - أبحاث علمية - تربية وتعليم

Average rating:

**Most recent posts (write a post by going to a forum) more...**

| Subject | Poster | Forum | Replies | Date |
|---|---|---|---|---|
| PLEASE DELETE | kiwi9000 | forums | 0 | 1 hour ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: You don't have to ask, cause you already know | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |

**Institutional Support**

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# Gita Press, Gorakhpur

**Our Publications, Kalyan and Kalyana-Kalpataru available at :**

| | |
|---|---|
| **Gorakhpur—273005** | Gita Press—P.O. Gita Press ✆ (0551) 2334721; Fax 2336997 website:www.gitapress.org / e-mail:booksales@gitapress.org |
| **Delhi—110006** | 2609, Nai Sarak ✆ (011) 23269678; Fax 23259140 |
| **Kolkata—700007** | Gobind Bhavan-Karyalaya, 151, Mahatma Gandhi Road e-mail : gobindbhawan@gitapress.org, ✆ (033) 22686894; Fax 22680251 |
| **Mumbai—400002** | 282, Samaldas Gandhi Marg (Princess Street) Near Marine Lines Station ✆ (022) 22030717 |
| **Kanpur—208001** | 24/55, Birhana Road ✆ (0512) 2352351; Fax 2352351 |
| **Patna—800004** | Ashok Rajpath, Opposite Women's Hospital ✆ (0612) 2300325 |
| **Ranchi—834001** | Cart Sarai Road, Upper Bazar ✆ (0651) 2210685 |
| **Surat—395001** | Vaibhav Apartment, Opposite Nutan Niwas, Bhatar Road e-mail : suratdukan@gitapress.org ✆ (0261) 2237362, 2238065 |
| **Indore—452001** | G-5, Shree Vardhan, 4 R.N.T. Marg ✆ (0731) 2526516, 2511977 |
| **Jalgaon—425001** | 7, Bhim Singh Market Near Railway Station ✆ (0257) 2226393; Fax (0257) 2220320 |
| **Hyderabad—500095** | 41, 4-4-1; Dilshad Plaza, Sultan Bazar ✆ (040) 24758311 |
| **Nagpur—440002** | Shriji Kripa Complex, 851, New Etawari Road ✆ (0712) 2734354 |
| **Cuttack—753009** | Bhartiya Towers, Badam Badi ✆ (0671) 2335481 |
| **Raipur—492009** | Mittal Complex, Ganjpara Telghani Chowk ✆ (0771) 4034430 |
| **Varanasi—221001** | 59/9, Nichibag ✆ (0542) 2413551 |
| **Haridwar—249401** | Sabjimandi, Motibazar ✆ (01334) 222657 |
| **Rishikesh—249304** | Gita Bhawan, P.O.-Swargashram e-mail : gitabhawan@gitapress.org ✆ (0135) 2430122, 2432792 |
| **Coimbatore—641018** | Gita Press Mansion, 8/1M, Racecourse ✆ (0422) 3202521 |
| **Bangalore—560027** | #15, 4th 'E' Cross, K.S. Garden, Lalbagh Road ✆ (080) 22955190, 32408124 |

**Station-Stalls—** **Delhi** (Platform No. 12); **New Delhi** (No. 12-13); **Hazarat Nizamuddin** [Delhi] (No. 4-5); **Kota** [Rajasthan] (No. 1); **Bikaner** (No. 1); **Gorakhpur** (No. 1); **Kanpur** (No. 1); **Lucknow** [N.E. Railway]; **Varanasi** (No. 4-5); **Mughal Sarai** (No. 3-4); **Haridwar** (No. 1); **Patna** (Main Entrance); **Ranchi** (No. 1); **Dhanbad** (No. 2-3); **Muzaffarpur** (No. 1); **Samastipur** (No. 2); **Howrah** (No. 5 & 18 Both); **Kolkata** (No. 1); **Sealdah Main** (No. 8); **Asansol** (No. 5); **Cuttack** (No. 1); **Bhubaneshwar** (No. 1); **Aurangabad** [Maharashtra] (No. 1); **Secunderabad** [A.P.] (No.1); **Guwahati** (No. 1); **Kharagpur** (No.1-2); **Raipur** [Chhattisgarh] (No. 1); **Bangalore** (No.1); **Yesvantpur** (No.6); **Sri Satya Sai Prashanti Nilayam** [South Central Railway] (No.1) and **I.S.B.T. (Delhi)**

**Retail Counters**

| | |
|---|---|
| **Churu—331001** | Rishikul-Brahmacharyashram, Purani Sarak; ✆ **(01562) 252674** |
| **Rishikesh—249192** | Muni Ki Reti |
| **Tirupati—517504** | Shop No. 56, T.T.D. Mini Shopping Complex, Tirumalai Hills |
| **Berhampore—742101** | Municipal Market Complex, Block-B, Stall No. 57 to 60, I[st] Floor, K.N. Road (Murshidabad) |

ISBN 81-293-0686-7



Code 919

॥ శ్రీహరిః ॥

919

# మంచి కథలు

उपयोगी कहानियाँ ( तेलुगु )





గీతాప్రెస్, గోరఖ్‌పూర్

919

||శ్రీహరిః||

मंचि कथलु ( उपयोगी कहानियाँ ) तेलुगु

# మంచి కథలు

అనువాదం:

ఘట్టమరాజు

గీతాప్రెస్
గోరఖ్‌పుర్

Books are also available at—

1. Gita Press, Gorakhpur Ki Pustak-Dukan, Dukan No. 41, 4-4-1, Dilshada Plaza, Sultan Bazar, Hyderabad ✆ (040) 24758311
2. Secunderabad, Railway Station, Platform No. 1

Twelfth Reprint 2009 5,000
Total 1,01,500

❖ **Price : Rs. 7**
**(Seven Rupees only)**

ISBN 81-293-0686-7

Printed & Published by :
**Gita Press, Gorakhpur—273005 (INDIA)**
(a unit of Gobind Bhavan-Karyalaya, Kolkata)
Phone - (0551) 2334721; Fax - (0551) 2336997
e-mail : **booksales@gitapress.org** website : **www.gitapress.org**

॥ శ్రీహరిః ॥

## మనవి

ఈ పుస్తకంలో పిల్లలకు పనికివచ్చే 36 పిట్టకథలున్నాయి. ఇవన్నీ ప్రజల నోళ్లల్లో నానినవే. ఒకప్పటి పిన్నలు, నేటి పెద్దలు తమ అమ్మమ్మ ద్వారానో, నాన్నమ్మ ద్వారానో విన్నవే. జీవితం మానవుడికి దేవుడు ఇచ్చిన వరం. దీన్ని సుఖప్రదం చేసుకొని, పదిమందికీ వుపయోగపడేలా చేసుకొనడం ప్రతి మనిషి కర్తవ్యం

నేటి బాలలే రేపటి పౌరులు. జీవితాన్ని చక్కదిద్దుకొంటూ, నలుగురికీ తోడ్పడుతూ మనిషి మంచిమనిషిగా రూపొందేందుకు ఈ మంచికథలు దారిదీపాలుగా వుపయోగపడతాయి. పేరుకు 'మంచి కథలు' బాలలకోసం రాయబడినా, ఇవి పెద్దలకు కూడా పనికివస్తాయి.

హనుమాన్ ప్రసాద్ పోద్దార్

## విషయ సూచిక

||శ్రీహరిః||

# మంచి కథలు

## 1. మంచి మనిషి

ఓ ధనవంతుడు ఓ గుడిని కట్టించాడు. గుడిలోని దేవుని పూజ చేసేందుకని ఓ పూజారిని నియమించాడు. దేవాలయం ఖర్చుల నిమిత్తమై పొలమూపుట్రా, తోటలు మాన్యంగా ఇచ్చాడు. పేదాసాదా, బీదబిక్కీ, సాధువులూ సన్యాసులూ నాలుగైదు రోజుల పాటు దేవాలయంలో వుండి, భగవంతుని ప్రసాదం స్వీకరించి, తృప్తి పడేలా ఏర్పాట్లు చేశాడు. దేవళం ఆస్తిపాస్తుల్ని భద్రంగా కాపాడుతూ, దేవాలయ వ్యవహారాలను చక్కదిద్దుకునే ఓ మంచిమనిషి కోసం ఎదురు చూడసాగాడు.

ఆ ధనికుని వద్దకు ఎంతోమంది వచ్చారు. గుడిపనులు చూసుకొనే ఉద్యోగం లభిస్తే, మంచి జీతం దొరకుతుందని ఆశపడ్డారు. కాని ఆ శ్రీమంతుడు అందరినీ తిప్పి కొట్టాడు. 'నాకొక మంచి మనిషి కావాలి. అతన్ని నేనే ఎన్నుకొంటాను' అని అందరితో చెప్పేవాడు.

చాలామంది ఆ ధనికుణ్ణి మనస్సుల్లోనే తిట్టి పోశారు. అతన్ని మూర్ఖునిగా, పిచ్చివాడిగా జమకట్టారు. కాని ఆ ధనవంతుడు ఎవరి మాటలనూ లెక్కపెట్టేవాడు కాదు. గుడి తలుపులు తెరవగానే, ప్రజలు దేవుని దర్శించేందుకని వచ్చేవారు. అప్పుడు ఆ ధనవంతుడు మేడమీదినుంచి గుడికి వచ్చి పోయేవారిని జాగ్రత్తగా గమనిస్తూ వుండేవాడు.

ఓ రోజు ఓ మనిషి దేవుణ్ణి దర్శించాలని వచ్చాడు. మాసిన, చిరిగిన బట్టల్లో వున్న ఆ వ్యక్తి పెద్దగా చదువుకున్న వాడిలా కూడా కనపడలేదు. అతను భగవంతుని దర్శించి, వెళ్ళిపోయేటప్పుడు, ఆ ధనికుడు అతన్ని తన వద్దకు రమ్మని సైగ చేశాడు.

"మీరు ఈ దేవాలయ వ్యవహారాలను నిర్వహించే పని చేపడ్తారా?' అని అడిగాడు.

ఆ వ్యక్తి నివ్వెరపోయాడు. "నేను ఎక్కువగా చదువుకోలేదు. ఇంత పెద్ద దేవళం పనులు ఎలా నిర్వహించగలను?" అని అన్నాడు.

"నాకు పెద్ద పండితులతో పనిలేదు. ఓ మంచిమనిషి చేతికి ఈ గుడిపనులు చూసే బాధ్యతను అప్పగించదలిచాను".

ధనికుడు ఆవ్యక్తితో అన్నాడు.

అప్పుడా మనిషి అన్నాడు కదా- "ఇంతమందిలో మీరు నన్నే మంచిమనిషిగా ఎలా భావించారు?"

"మీరు మంచిమనిషని నాకు తెలుసు. గుడికి వచ్చేదారిలో ఓ ఇటుకబెడ్డ పాతుకు పోయివుంది. దాని మొన బయటికి కనపడుతూవుంది. ఆ ఇటుకబెడ్డ మొన ఈ దారిగుండా వచ్చిపొయ్యేవాళ్ల కాలికి తగులుతూ వుండటం, వాళ్ళు ముందుకు తూలడమో, కిందపడి, లేచి, దుమ్ము దులుపుకొని పోవడమో నేను చాలా రోజుల్నించీ చూస్తూనే వున్నాను. ఆ ఇటుకబెడ్డ మొన మీ కాలికి తగల్లేదు. అయినా మీరు దాన్ని గమనించి, తొలగించి వేసే ప్రయత్నం చేశారు. మీరు ఓ కూలివానితో గునపం తెప్పించి, ఆ ఇటుకపెల్లను పెకలించి, నేలను చదును చేశారు". - ధనవంతుడు ఆవ్యక్తితో అన్నాడు.





అప్పుడావ్యక్తి ఇలా అన్నాడు - "ఇదేమీ పెద్దపనికాదు. దారికి అడ్డమయ్యే రాళ్లూరప్పలూ, ముళ్లూగిళ్లూ, ఇటికలు గిటికలూ కనపడితే వాటిని తొలగించడం ప్రతిమనిషి కర్తవ్యం"

"తన కర్తవ్యాన్ని తెలుసుకొని, నడచుకొనే మనుష్యులే మంచివాళ్లు". ధనికుడు అన్నాడు.

ఆ వ్యక్తికి దేవాలయ వ్యవహారాలు నిర్వహించే ఉద్యోగం దొరికింది. అతను గుడి పనులను చక్కగా చూసుకోసాగాడు.

**నీతి: మంచివాడికి మంచే జరుగుతుంది.**

\--*--

# 2. దురాశ దుఃఖం చేటు

రామయ్య చాలా నిజాయితీ కలమనిషి. కాని పాపం, పేదవాడు. పగలంతా అడవిలో ఎండుకట్టెలు కొట్టే సాయంకాలం కాగానే మోపు కట్టి బజారుకు వెళ్లేవాడు. కట్టెలు అమ్మగా వచ్చిన డబ్బుతో తిండిగింజలు కొనుక్కొని ఇంటికి వచ్చేవాడు. కష్టపడి పనిచేసి కడుపు నింపుకొనేవాడు.

ఓ దినం రామయ్య కట్టెలు కొట్టడానికని అడవికి వెళ్లాడు. నదివొడ్డున వున్న ఓ ఎండుచెట్టు కొమ్మను నరకడానికని చెట్టెక్కాడు. కొమ్మ నరుకుతున్నప్పుడు చెయ్యి జారి గొడ్డలి నదిలో పడిపోయింది. రామయ్య కిందికి దిగాడు. నదిలో ఎంత వెతికినా గొడ్డలి కనపడితే వొట్టు. రామయ్య ఎంతో విచారంతో, నదివొడ్డున తలపట్టుకు కూర్చుండిపొయ్యాడు. అతని కళ్లలోంచి నీళ్లు కారసాగాయి. అతనివద్ద మరోగొడ్డలి కొనటానికి డబ్బుల్లేవు.

గొడ్డలి లేకపోతే ఇంటిల్లిపాదీ పస్తులు వుండాల్సిందే. అతనికి దిగులు పట్టుకొంది.

రామయ్య స్థితి చూసి వనదేవతకు జాలి కలిగింది. బాలుని వేషంలో ప్రత్యక్షమై అతనితో ఇలా అన్నాడు-"అన్నా! నీవు ఎందుకు ఏడుస్తున్నావు?"

రామయ్య అతనికి నమస్కారం చేసి ఇలా అన్నాడు- "నా గొడ్డలి నీళ్ళలో పడిపోయింది. మరి నేను కట్టెలు ఎలా కొట్టేది? నా భార్యాపిల్లలను పోషించేదారి ఏది?"

"నీవు ఏడవొద్దు. నేను నీగొడ్డలి తీసి ఇస్తాను," వనదేవత అతనితో అన్నాడు.





దేవత నీటిలో మునకవేసి, ఓ బంగారు గొడ్డలి పైకి తీసుకొచ్చి -"ఇదిగో, నీ గొడ్డలి. తీసుకో." - అన్నాడు.

రామయ్య తలెత్తి చూసి -"ఇది ఎవరో గొప్పింటివాళ్లది. నేను పేదవాణ్ణి. గొడ్డలి చేసుకొనేటంత బంగారు నాకెక్కడినుండి వస్తుంది? ఇదేమో, బంగారు గొడ్డలి" అన్నాడు.

దేవత మరోసారి నీటిలో మునకేసి వెండిగొడ్డలి పైకి తీసి రామయ్యకు ఇవ్వబోయ్యాడు. రామయ్య ఇలా అన్నాడు - "స్వామీ, నా అదృష్టం బాగాలేదు. నా కోసం మీరెంత కష్టపడ్డా నా గొడ్డలి చిక్కలేదు. నాగొడ్డలి మామూలు ఇనుపది".

దేవత మూడోసారి నీటిలో మునిగి, ఇనుపగొడ్డలి పైకి తీసి ఇచ్చాడు. రామయ్య సంతోషించాడు. అతను తనగొడ్డలి తీసుకొని వనదేవతకు కృతజ్ఞతలు తెల్పాడు. వనదేవత రామయ్య నీతీనిజాయితీ చూసి ప్రసన్నుడయ్యాడు. "నీ నిజాయితీ నాకెంతగానో నచ్చింది. నీవు ఈ రెండు గొడ్డళ్లు కూడా తీసుకెళ్ళు" అన్నాడు.

రామయ్య బంగారు, వెండి గొడ్డళ్లు ఇంటికి తీసుకెళ్లాడు. అతను ధనవంతుడయ్యాడు. అతను కట్టెలు కొట్టడానికని అడవికి వెళ్లడం మానేశాడు.

పొరుగింటి పుల్లయ్య ఓరోజు 'నువ్వెందుకు అడవికి వెళ్లి కట్టెలు కొట్టడం మానేశావు?' అని రామయ్యను అడిగాడు. భోళాశంకరుడైన రామయ్య కథంతా పూసగుచ్చినట్లు చెప్పేశాడు.

పుల్లయ్య వొట్టి దురాశాపరుడు. బంగారు, వెండి మీది పేరాసతో మరుసటిరోజు ఉదయం గొడ్డలి తీసుకొని కట్టెలు కొట్టడానికని అడవికి వెళ్లాడు. రామయ్య కట్టెలు కొట్టిన చెట్టు పైనే కూర్చొని కట్టెలు కొట్టసాగాడు. అదేపనిగా తనగొడ్డలిని నీటిలోనికి జారవిడిచాడు. చెట్టు దిగివచ్చి, గట్టుమీద కూర్చొని వలవలా ఏడ్వసాగాడు.

వనదేవత పుల్లయ్య దురాశకు తగిన పాఠం నేర్పాలని ప్రత్యక్షమయ్యాడు. పుల్లయ్యను అడిగి, నీళ్ళల్లో మునిగి బంగారు గొడ్డలి పైకి తీసి చూపించాడు. పుల్లయ్య ఆనందంతో ఎగిరి గంతేశాడు-'ఇదే నా గొడ్డలి!' అని కేకవేశాడు.



'నీవు అబద్ధం చెప్తున్నావు. ఇది నీగొడ్డలి కాదు'. అని అన్నాడు వనదేవత. దేవత బంగారు గొడ్డలిని నీళ్లల్లో పారవేసి మాయమయ్యాడు. దురాశకు పోయిన పుల్లయ్య వున్న ఇనుపగొడ్డలిని కూడా పోగొట్టుకున్నాడు. గుండెలు బాదుకొంటూ ఇంటిముఖం పట్టాడు.

*నీతి:* పేరాశవల్ల నష్టమే కలుగుతుంది.

~~*~~

# 3. దురాశపరుడైన రాజు

పూర్వం గ్రీసుదేశంలో మిదాసు అనే ఓరాజు వుండేవాడు. అతనికి గంపెడంత ఆశ. అతనికి కూతురంటే పంచప్రాణాలు. కూతురు తర్వాత అతను బంగారంటే పడిచచ్చేవాడు. అతను నిద్రలో కూడా బంగారును కలవరించేవాడు.

ఓదినం మిదాసు కోశాగారంలో వొంటరిగా కూర్చొని బంగారు ఇటికలు, నాణేలను లెక్కపెడుతున్నాడు. అకస్మాత్తుగా ఓ దేవదూత అతని ముందు ప్రత్యక్షమై 'మిదాసు! నీవు నిజంగా పెద్ద ధనవంతుడివి'. అన్నాడు.

మిదాసు మొగం వేలాడేసుకొని -"నేనూ ఓ ధనవంతుణ్ణా? నావద్ద బంగారు చాలా కొద్దిగా వుంది". అన్నాడు.

" ఇంత బంగారమున్నా నీకు సంతోషం కలగడం లేదా? మరి, ఎంత బంగారం కావాలో చెప్పు?"- దేవదూత ప్రశ్నించాడు.

"నేను చేత్తో తాకిన వస్తువెల్లా బంగారం కావాలి. అప్పుడే నాకు తృప్తి." - అన్నాడు రాజు.

దేవదూత ఇలా అన్నాడు - "రేపటి ఉదయంనుంచి నీవు ఏవస్తువును తాకితే అదంతా బంగారమవుతుంది. సరేనా?"

ఆ రాత్రి మిదాసుకు కునుకు పడితే వొట్టు. తెల్లవారు జామున్నే నిద్రలేచాడు. ఓ కుర్చీని చేత్తో తాకాడు. అది బంగారు కుర్చీ అయింది. ఓ బల్లను తాకాడు. అది కాస్తా బంగారందై కూచుంది. మిదాసు రాజు వెర్రి సంతోషంతో ఎగిరి గంతులు వేయసాగాడు. అతను పిచ్చెత్తినట్లు పరుగెత్తుతూ తోటలోకి వెళ్లి చెట్లను తాకాడు. పూలను, ఆకులను, కొమ్మలను, రెమ్మలను, పూలకుండీలను తాకాడు. అన్నీ బంగారమై తళతళా మెరవసాగాయి.



మిదాసు ముట్టేందంతా బంగారం కాసాగింది. ఇప్పుడు మిదాసు వద్ద కొండంత బంగారం!

పొద్దున్నుంచీ ఎగురుతూ, గెంతుతూ వున్నందువల్ల మిదాసు బాగా అలిసిపొయ్యాడు. అతను ధరించిన చీనిచీనాంబరాలు కూడా బంగారువై పోయి వొంటికి బరువుగా తోచసాగాయి. అతనికి బాగా ఆకలిదప్పులు వేశాయి. తోటనుంచి రాజభవనంలోనికి వచ్చి మిదాసు ఓ బంగారు కూర్చీమీద కూర్చొన్నాడు. ఓ నౌకరు అతని ముందున్న బల్లమీద పళ్ళెంలో భోజనం, నీళ్లగ్లాసు వుంచాడు. మిదాసు భోజనం చేద్దామని చేత్తో అన్నం ముట్టుకొన్నాడో లేదో, అది కాస్తా బంగారమై పోయింది. తాగుదామని నీళ్లగ్లాసు చేత్తో పైకెత్తాడో లేదో నీళ్ళూ, గ్లాసు కూడా బంగారమై పోయాయి. మిదాసు కళ్లముందు బల్లమీద రకరకాల భోజనపదార్థాలున్నాయి. కాని బంగారుగొంతులోకి దిగుతుందా? ఆయన ఆకలిదప్పులు తీరుతాయా?

మిదాసు గొళోమని ఏడ్చాడు. ఇంతలో అతని ముద్దుల కూతురు గెంతుతూ అతని వద్దకు వచ్చింది. అతని వొడిలో వాలి, కన్నీళ్ళు తుడువసాగింది. మిదాసు కూతురిని తన గుండెలకు హత్తుకొన్నాడు. ఇంకేముంది? అక్కడ అతని కూతురు వుంటేగా? అతని వొడిలో కూతురు ఆకారంలో బరువైన, మోయలేని ఓ బంగారు విగ్రహం కనిపించింది. పాపం! మిదాసు తల బాదుకొంటూ, బిగ్గరగా ఏడవసాగాడు. దేవదూతకు జాలికలిగింది. అతని ముందు ప్రత్యక్షమయ్యాడు. అతన్ని చూడగానే మిదాసు పొలోమని అతని కాళ్లపై పడి "స్వామీ, మీరు నాకిచ్చిన వరం వెనక్కు తీసుకొండి. అదేపదివేలు". అని బతిమాలాడు.



అప్పుడు దేవదూత మీదాసును ఇలా ప్రశ్నించాడు "మీదాసూ! నీకు ఇప్పుడు బంగారం అక్కర్లేదా? ఓ గ్లాసు నీళ్ల విలువైన వంటావా? లేదా బంగారమా? ఓ ముద్ద అన్నం విలువైన దంటావా? లేదా బంగారమా?

మీదాసు రెండు చేతులు జోడించి దేవదూతతో ఇలా అన్నాడు - "నాకు బంగారమక్కర్లేదు. మనిషికి బంగారుతో పనిలేదన్న సంగతి నాకు ఇప్పుడు తెలిసివచ్చింది. బంగారం లేకున్నా మనిషి బతగ్గలడు. కాని గ్లాసెడు నీళ్ళు, ఓ ముద్ద అన్నం



లేకపోతే జీవించలేడు. నాకు ఇప్పుడు బంగారంమీద మోహం పోయింది".

దేవదూత ఓ పాత్రలో నీళ్ళ ఇచ్చి "ఈనీళ్లను అన్ని వస్తువులపై చిలకరించు" అన్నాడు.

మీదాసు ఆనీళ్ల తీసుకొని తన కూతురి విగ్రహంపైన, కుర్చీపైన, బల్లపైన, భోజనం, నీళ్ళు, చెట్లపైన- ఇలా అన్ని వస్తువులపైనా చిలకరించాడు. అవన్నీ మునుపటిలా మారిపొయ్యాయి.

మీదాసు ఆనందానికి అంతులేకుండా పోయింది.

నీతి: *ఆశ హద్దుమీరితే దుఃఖం దాపురిస్తుంది.*

***

# 4. ఆలోచించకనే ఏపనీ చేయరాదు

ఓరైతు ఓ ముంగిసను పెంచుకొన్నాడు. ముంగిస చాలా తెలివైనదే కాక స్వామిభక్తి కూడా కలిగిన పెంపుడు జంతువు. ఓ రోజు రైతు పనిమీద బయటికి వెళ్లాడు. రైతు భార్య పసిబిడ్డకు పాలిచ్చి, నేలమీద పండబెట్టింది. కడవ, పగ్గం తీసుకొని బావినుంచి నీళ్ల తేవడానికని బయలు దేరింది. పోతూ, పాపను చూస్తూవుండమని ముంగిసకు చెప్పి మరీవెళ్లింది.

రైతుభార్య బయటికి పోగానే పుట్టలోనుంచీ ఓ నాగుపాము వచ్చి, ఇంట్లో ప్రవేశించింది. పాప నేలమీద బొంతపై నిద్ర పోతూవుంది. పాము పాపవైపు చరచరా పాకుతూ వస్తూవుంది. ముంగిస ఇది పసికట్టి గభాలున పాముపైకి దుమికింది. పామును ముక్కలు ముక్కలుగా కొరికి పడవేసింది. తలుపు దగ్గిరకు వచ్చి, రైతుభార్య రాకకోసం ఎదురుచూస్తూవుంది.

రైతుభార్య నీళ్లకడవ చంకన బెట్టుకొని వచ్చింది. వీధి తలుపు బయటవున్న ముంగిసను చూసింది. రక్తం కారుతున్న ముంగిస మూతిని చూసి, అదెక్కడ పసిపాపను కొరికి వేసిందో అని భయపడింది. ఒక్కసారి దుఃఖం, కోపం ముంచుకొచ్చాయి. ఆమె చంకలోని కడవతీసి ముంగిస తలపై బాదింది. పాపం! ముంగిస కాస్తా గుటుక్కుమంది.

ఆమె ఇంట్లోకి పరిగెత్తుకు పోయింది. చూస్తే, పాప నేలమీద బొంతపై హాయిగా నిద్రపోతూవుంది. కానిప్రక్కనే ఓ పాము ముక్కలు ముక్కలై పడివుంది. ఆమెకు తన పొరపాటు తెలిసి వచ్చింది. ఆమె ఉన్నపాటున ముంగిసవైపు పరుగెత్తి వెళ్లింది. చచ్చిపోయిన ముంగిసను వొళ్లోకి తీసుకొని వెక్కి వెక్కి





ఏడ్వసాగింది. కాని ఇప్పుడు ఏడిస్తే ఏం లాభం? అందుకనే పెద్దలన్నారు -

బినా విచారే జో కర్తె, సో పాఛే పఛ్‌తాయ్
కామ్ బిగారే అపనో, జగ్‌మే హోత్ హసాయ్

(ఆలోచించకుండా ఏపనైనా చేస్తే, పశ్చాత్తాప పడాల్సి వస్తుంది. మనపని చెడిపోవడమే కాకుండా, పదిమంది మధ్య నవ్వులపాలు కావాల్సి వస్తుంది కూడా).

---

నీతి: ఆలోచించక చేస్తే పని నీకు ఎదురవుతుంది శని.

# 5. దయకు దొరకిన ఫలం

సభక్తజిన్ పాదుషా మొదట్లో చాలా బీదవాడు. అతను ఓ మామూలు సిపాయిగా వుండేవాడు. ఓరోజు అతను తుపాకి తీసుకొని, గుర్రమెక్కి అడవిలో వేటకు వెళ్లాడు. ఆ దినం అతను అడవి అంతా గాలించాడు. ఒక్క జంతువు కూడా చిక్కకపొయ్యే సరికి అతనికి విసుగు పుట్టింది. చాలా దూరం వెళ్లగా వెళ్లగా అతనికి ఓ జింక, జింకపిల్ల కనపడ్డాయి. సభక్తజిన్ గుర్రాన్ని ఆ జింకలవైపు దౌడాయించాడు.

జింకేమో పరిగెత్తి భయంకొద్దీ ఓ పొదలో దాక్కొంది. కాని, పాపం జింకపిల్ల సభక్తజిన్ చేతికి చిక్కిపోయింది. అతను దాని నాలుగుకాళ్లు కట్టేవేసి, గుర్రంమీద దాన్ని వేసుకొని దానితల్లి కోసం నాలుగువైపులా గాలించాడు. ఎంతవెదికినా అతనికి తల్లి జింక అగపడలేదు. నిరాశచెంది అతను తిరుగుదోవ పట్టాడు.

సభక్తజిన్ తనపిల్లను బంధించి తీసుకొని పోతూండటం తల్లి జింక చూసింది. బిడ్డ మీది ప్రేమ కొద్దీ పొదనుంచీ బయటికి వచ్చింది. సభక్తజివ్ గుర్రంవెంటే పరుగెత్తసాగింది. దూరం వెళ్లిన తర్వాత, సభక్తజిన్ వెనక్కు తిరిగి చూశాడు. తనవెంబడే జింక రావడం చూసి అతనికి ఆశ్చర్యం కలిగింది. అతని హృదయం కరిగి పొయ్యింది. అతను జింకపిల్ల కట్లను విప్పి, దాన్ని గుర్రంమీదినుంచి కిందికి దించాడు. జింక సంతోషంతో పిల్లతో సహా చెంగు చెంగున గెంతుతూ అడివిలోకి పారిపొయ్యింది.

ఆ రాత్రి సభక్తజిన్‌కు ఓ కలవచ్చింది. ఓ దేవదూత కనపడి ఇలా అన్నాడు – "సభక్తజిన్! ఈ రోజు నీవు ఓ జింకపట్ల దయ



చూపించావు. భగవంతుడు నీపనికి ప్రసన్నుడై నీపేరు చక్రవర్తుల జాబితాలోకి చేర్చాడు. నీవు ఓ రోజు తప్పకుండా సామ్రాట్టువి అవుతావు".



సభక్తజిన్ కల నిజమయింది. అతను భవిష్యత్తులో చక్రవర్తి అయ్యాడు. ఓ జింక పట్ల దయ చూపినందుకు అతనికి ఈ ఫలం కలిగింది. ప్రాణులపట్ల దయ ప్రదర్శించేవారికి భగవంతుడు తప్పక ప్రసన్నుడు అవుతాడు.

నీతి: ప్రాణులపట్ల దయచూపితే మానవుడు
వరాలు గుప్పిస్తాడు భగవంతుడు.

* * *

# 6. తండ్రీ కొడుకులు

ఓ యువకుడైన తండ్రి తన చిట్టిబాబును వాళ్లో కూర్చోపెట్టుకొని ఆడిస్తున్నాడు. ఇంతలో ఎక్కడినుంచో ఓ కాకివచ్చి ఎదురింటి పెంకులపై వాలింది. బాబు తండ్రిని 'నాన్నా, అదేమిటి?' అని అడిగాడు.

తండ్రి - 'అది కాకి' అని చెప్పాడు.

కొడుకు తండ్రిని మళ్లీ అడిగాడు- 'నాన్నా, అదేమిటి?'

తండ్రి మళ్లీ చెప్పాడు - 'అది కాకి'





కొడుకు తండ్రిని పదేపదే అడగసాగాడు. 'అదేమిటి? అదేమిటి?' అని.

తండ్రి ఓపిగ్గా మళ్లీమళ్లీ 'అదికాకి' అని బదులిస్తూ వుండేవాడు.

కొన్నేళ్లు గడిచాయి. బాబు పెరిగి పెద్దవాడయ్యాడు. తండ్రేమో ముసలివాడయ్యాడు. ఓ రోజు తండ్రి చాపమీద కూర్చొన్నాడు. ఎవరో అతని కొడుకును చూడాలని వచ్చినట్లుంది. తండ్రి కొడుకును అడిగాడు-'ఎవరు బాబూ వచ్చింది?' కొడుకు వచ్చినతని పేరు చెప్పాడు.

కొంతసేపటికి మరొకరు వచ్చారు.

'ఎవరు వచ్చారు?' అని తండ్రి అడిగాడు.

విసుగ్గా కొడుకు బదులిచ్చాడు-"మీరు ఓచోట వూరకే పడివుండ కూడదూ? పనీపాటా లేదు కాని, ఎవరు వచ్చారు? ఎవరు పోయారు? అంటూ దినమంతా వాకటే ఆరాలు తీస్తుంటారు?"

తండ్రి గట్టిగా నిట్టూర్చాడు. చేత్తో తలపట్టుకొన్నాడు. ఎంతో బాధతో మెల్లమెల్లగా కొడుకుతో ఇలా అన్నాడు-"నేను నిన్ను ఓసారి అడిగితేనే ఇంతగా విరుచుకు పడుతున్నావే? 'ఇదేమిటి? ఇదేమిటి?' అని నీవు వందలాదిసార్లు వేధించేవాడివే! నేను నిన్నెప్పుడైనా కసురుకొన్నానా? నేను నీకు వోపిగ్గా 'బాబూ, అదికాకి' అని చెప్పేవాడినిగా!"

తల్లిదండ్రులను ఇలా కసిరేవారు మంచివాళ్లు కాదు సుమా! మిమ్మల్ని పెంచిపెద్ద చేయడంలో మీ అమ్మానాన్నలు ఎన్ని కష్టాలు పడ్డారో, మిమ్మల్ని ఎంతగా ప్రేమించారో, ఓ సారి ఆలోచించండి.

---

నీతి: సహనానికి మించిన సంపదలేదు.

# 7. దేవుడు అన్ని చోట్లావున్నాడు

సోమయ్య తనకొడుకు రాముకు రాత్రి నిద్రపొయ్యేటప్పుడు కథలు చెప్పేవాడు. ఓరోజు అతను కొడుకుతో ఇలా అన్నాడు-

"బాబూ, ఓ మాట మాత్రం ఎప్పుడూ మరిచిపోకు. దేవుడు అన్నిచోట్లా వున్నాడు సుమా"!

రాము అటూ ఇటూ తొంగి చూసి "నాన్నా, భగవంతుడు అన్ని చోట్లా వున్నాడా? మరి, నాకెక్కడా కనపడటం లేదే?" అన్నాడు ఆశ్చర్యంగా.

"బాబూ, మనం భగవంతుని చూడలేం. కాని పరమాత్ముడు అన్ని చోట్లావున్నాడు. మనం చేసే అన్ని పనులను గమనిస్తూ వుంటాడు". - సోమయ్య కొడుక్కి చెప్పాడు.

రాము తండ్రి చెప్పిన మాటలను జాగ్రత్తగా విన్నాడు. కొద్దిరోజుల తర్వాత కరువు వచ్చిపడింది. సోమయ్య పొలాల్లో ఏమి పండలేదు. ఓ రాత్రి సోమయ్య కొడుకును వెంటబెట్టుకొని వూరవతలి పొలానికి వెళ్లాడు. ఆ పొలం మరోరైతుది. ఎవ్వరికీ తెలియకుండా ఓ మోపు వరికంకులు కోసి, ఇంటికి తెచ్చుకోవాలని సోమయ్య పథకం. పొలం గట్టుమీద రాముని నిలబడమని, "నీవు నాలుగు దిక్కుల్లా జాగ్రత్తగా చూస్తూవుండు. ఎవరైనా అటు ఇటూ కనపడితే నాకు చెప్పు" అని సోమయ్య కొడుక్కి చెప్పాడు.

సోమయ్య పొలంలో వరికంకులు కోసేందుకని దిగాడో లేదో రాము -"నాన్నా, ఆగండి" అన్నాడు.

"ఎవరైనా చూస్తున్నారా ఏం?"-

సోమయ్య అడిగాడు.

రాము -"ఔను నాన్నా, చూస్తున్నారు".



సోమయ్య పొలంలోనుంచి గట్టుమీదికి వచ్చాడు. నలువైపులా చూస్తే, అతనికి ఎవరూ కనపడలేదు. అప్పుడు అతను కొడుకును అడిగాడు -"ఎక్కడ? ఎవరూ అగపడటం లేదే?"



రాము -"దేవుడు అన్నిచోట్లా వున్నాడు. అందరు చేసేపనులు గమనిస్తూ వుంటాడని మీరే చెప్పారుగా! అలాంటప్పుడు మీరు వరికంకులు కోస్తూవుంటే, దేవుడు చూడకుండా వుంటాడా?" సోమయ్య కొడుకు మాటలు విని సిగ్గుతో తలవొంచాడు. దొంగతనం చెయ్యకుండా కొడుకుతో కలిసి ఇంటికి వెళ్లాడు.

నీతి: దేవుడున్నాడు జాగ్రత్త!

--*--

# 8. మిత్రుడి సలహా

దుర్గాదాసు బాగా కలిగున్న రైతే. కాని వొట్టి సోమరి. అతను పొలంగట్రా చూడటానికి వెళ్లేవాడు కాదు. ఆవులు గేదెల గురించి అసలే పట్టించుకొనేవాడు కాదు. ఇక ఇంట్లో ఏ వస్తువులు వున్నాయో, ఏవి పొయ్యాయో చూసుకొనేవాడు కూడాకాదు. అన్ని పనులూ నౌకర్లకే వదిలిపెట్టేవాడు. అతని బద్దకం, అలక్ష్యం వల్ల ఇంటి పరిస్థితి అధ్వాన్నమై పోయింది. అతనికి పొలాల వల్ల నష్టం రాసాగింది. పాడివల్ల కూడా చెప్పుకోదగ్గ లాభం వచ్చేదికాదు.

ఓ రోజు మిత్రుడు హరిశ్చంద్రుడు అతని ఇంటికి వచ్చాడు. అతను దుర్గాదాసు ఇంటి పరిస్థితిని జాగ్రత్తగా గమనించాడు. సోమరిపోతైన దుర్గాదాసు చెప్తేవిని, తన స్వభావం మార్చుకొనేవాడు కాదని అతనికి తెలుసు. ఎలాగైనా స్నేహితునికి మేలు చేయాలని ఆలోచించి దుర్గాదాసుతో ఇలా అన్నాడు - "మిత్రుడా! నీకష్టాలు చూస్తుంటే నాగుండె తరుక్కుపోతూంది. నీ దారిద్ర్యం పటాపంచలయ్యే ఓ మంచి ఉపాయం చెప్తాను".

"బాబ్బాబూ! ఆ ఉపాయం కాస్త చెప్పి, పుణ్యం కట్టుకో కూడదూ? నీవు చెప్పినట్లే తు.చ.తప్పకుండా నడుచుకొంటాను". దుర్గాదాసు మిత్రునితో అన్నాడు.

హరిశ్చంద్రుడు -"పక్షులు లేవకముందే మానస సరోవరంలో వుండే ఓ హంస ఈ భూమిమీదికి వస్తుంది. అది ఎప్పుడు వస్తుందో, ఎక్కడ వాలుతుందో ఎవరికీ తెలియదు. కాని ఆ హంసను దర్శనం చేసుకొనే వాళ్లకు ఎలాంటి లోటూ వుండదు".



దుర్గాదాసు -"ఏమైనా సరే, నేను ఆ హంసను తప్పక చూడాలి."

హరిశ్చంద్రుడు వెళ్లిపొయ్యాడు. దుర్గాదాసు మరుసటిరోజు కోడి కూయక ముందే లేచాడు. ఇల్లు దాటి, హంసను వెతుక్కుంటూ పొలంవైపు వెళ్లాడు. అక్కడ పక్కపొలం యజమాని దుర్గాదాసు ధాన్యం కుప్పనుంచి ధాన్యాన్ని తన కుప్పలోకి ఎత్తిపోసుకోవడం చూశాడు. దుర్గాదాసును చూడగానే అతను సిగ్గుతో తలవంచుకొని, క్షమించమని ప్రార్థించాడు.



పొలంనుంచి అతను ఇంటికి తిరిగొచ్చాడు. గోశాల వైపు వెళ్లాడు. అక్కడ పసులకాపరి ఆవుపాలు పిండి, తనభార్య తెచ్చిన పాత్రలోకి వంచుతుండటం చూశాడు. దుర్గాదాసు అతన్ని మందలించాడు. ఇంట్లో ఫలాహారం సేవించి హంసను వెతుకుతూ బయులు దేరాడు. పొలం వైపు వెళ్లాడు. పొలం పని చేయటానికి

కూలీలు ఎవరూ రాలేదు. అతను అక్కడే కాస్సేపు ఆగాడు. కూలీలు వచ్చిన తర్వాత వాళ్లను మందలించాడు. ఇలా అతను వెళ్లిన చోటెల్లా, కొంతకు కొంతైనా నష్టం ఆగిపొయ్యింది.

దుర్గాదాసు ప్రతిదినమూ ఉదయమే నిద్రలేచి హంసను వెతుక్కొంటూ వెళ్లేవాడు. పొలాల్లో తిరిగేవాడు. అతను దినమూ రావడం చూసి నౌకర్లు, కూలీలు పనీపాటలు శ్రద్ధగా చెయ్యడం మొదలెట్టారు. అతని పొలాల్లో ఇంట్లో జరిగే చిల్లరమల్లర దొంగతనాలు నిలిచి పొయ్యాయి. మొదట్లో అతను ఏదో రోగం వచ్చిన వాడిలా కనపడేవాడు. ఇప్పుడు ఆరోగ్యం చేకూరింది. అతనికి మునుపు పొలాల్లో వచ్చే పంటకంటే ఇప్పుడు ఇబ్బడి ముబ్బడి రాసాగింది. ఆవులు, గేదెలనుంచి పాలు ఎక్కువగా రాసాగాయి.

ఓ రోజు హరిశ్చంద్రుడు మిత్రుడైన దుర్గాదాసుని చూడాలని వచ్చాడు. దుర్గాదాసు స్నేహితునితో ఇలా అన్నాడు-'మిత్రుడా! నాకు ఇంతవరకు హంస కనపడలేదు. కాని, దాన్ని వెతకడంలో నాకు ఎంతో మేలు కలిగింది'.

హరిశ్చంద్రుడు నవ్వి ఇలా అన్నాడు-'హంస అంటే మరేమిటో అనుకొన్నావు కామోసు? కష్టపడటమే తప్ప మరేమీ కాదు. రెక్కల కష్టం వూరకేపోదు. తన పని తాను చేసుకోకుండా, ఇతరులకు వదిలిపెట్టినవాడు ఎప్పుడూ నష్టపోతాడు. సొంతంగా రెక్కలు ముక్కలు చేసుకొని కష్టపడేవాడు నౌకర్ల పై ఆజమాయిషీ చేస్తూ సిరిసంపదలు, గౌరవమర్యాదలు పొందగలుతాడు.

నీతి: కష్టానికి ఫలం తప్పక దొరుకుతుంది.

~~*~~



# 9. స్వర్గదర్శనం

లక్ష్మీనారాయణ చాలా అమాయకుడైన కుర్రాడు. అతను ప్రతి రోజూ రాత్రిపూట నిద్ర పోయేటప్పుడు నాన్నమ్మను కథలు చెప్పమని మారాము చేసేవాడు. నాన్నమ్మ అతనికి నాగలోకం, పాతాళలోకం, గంధర్వలోకం, సూర్యలోకం, చంద్రలోకం మొదలైన కథలు వినిపించేది. ఓ రోజు నాన్నమ్మ అతనికి స్వర్గం గురించి చెప్పింది. స్వర్గలోక సౌందర్యం గురించి విన్న లక్ష్మీనారాయణ స్వర్గం చూడాలని పట్టు పట్టాడు.

మానవుడు స్వర్గం చూడలేడని నాన్నమ్మ లక్ష్మీనారాయణకు ఎంతగానో నచ్చ చెప్పింది. కాని అతను వినకుండా ఏడ్వసాగాడు. ఏడుస్తూ ఏడుస్తూనే నిద్ర పొయ్యాడు. అతనికి ఓ కల వచ్చింది. ఆ కలలో మిలమిలా మెరుస్తున్న ఓ దేవత వచ్చి అతని ప్రక్కన నిలబడి ఇలా చెప్పసాగాడు -"నాయనా! స్వర్గం చూడాలంటే విలువ చెల్లించాల్సి వుంటుంది. నీవు సర్కస్ చూడటానికి వెళ్లినప్పుడు టిక్కెట్టు కొంటావుగా? అలాగే స్వర్గం చూడాలన్నా నీవు మూల్యం చెల్లించాల్సిందే."

'నేను నాన్నమ్మను అడిగి డబ్బులు తీసుకోవాలి' అని లక్ష్మీనారాయణ కలలోనే ఆలోచించ సాగాడు. కాని దేవత అతనితో ఇలా అంది -'స్వర్గంలో నీ డబ్బులు చెల్లవు. ఇక్కడ మంచితనం, పుణ్యం అనే రూపాయలే చెల్లుబడి అవుతాయి. సరేకాని, ఇంద ఈడబ్బీ నీవద్ద వుంచుకో. నీవు ఎప్పుడైనా ఓ మంచిపని చేశావనుకో, దీన్లోకి ఓ రూపాయి వచ్చిపడుతుంది. అలాగే ఓ చెడ్డపని చేశావనుకో, దీన్లోంచి ఓ రూపాయి మాయమైపోతుంది. రూపాయలతో ఈ డబ్బీ నిండిపోగానే, నీవు స్వర్గం చూడగలవు".

కల చెదిరిపోగానే అతనికి తలవైపు నిజంగానే ఓ డబ్బీ కనపడింది. డబ్బీని చూసి అతను ఆనందంతో గంతులేశాడు. ఆ రోజు నాన్నమ్మ అతనికి ఓ పైసా ఇచ్చింది. అతను పైసా తీసుకొని బయటికి వెళ్లాడు. ఓ రోగిష్టి బిచ్చగాడు అతన్ని దానం చెయ్యమని అడిగాడు. లక్ష్మీనారాయణ బిచ్చగానికి దానం చెయ్యకుండా తప్పించుకోవాలని చూశాడు. ఇంతలో అతనికి అతని ఉపాధ్యాయుడు ఎదురయ్యాడు. గురువు తన శిష్యుల ఔదార్యాన్ని ఎంతగానో పొగిడేవాడు. ఆయన్ని చూడానే లక్ష్మీనారాయణ బిచ్చగానికి పైసా దానం చేశాడు. గురువు అతని వీపుతట్టి 'భేష్' అన్నాడు.

ఇంటికి రాగానే లక్ష్మీనారాయణ డబ్బీ తెరచి చూశాడు. కాని అది ఖాళీగా కనపడింది. అతనికి దుఃఖం కలిగింది. ఏడుస్తూ ఏడుస్తూ నిద్రపొయ్యాడు. కలలో దేవత మళ్లీ ప్రత్యక్ష మయ్యాడు. అతనితో ఇలా అన్నాడు -"నీవు గురువుగారి మెప్పుపొందాలని దానం చేశావు. అందువల్ల నీకు మెప్పు దొరికింది. ఇప్పుడు ఎందుకు ఏడ్వడం? లాభంకోరి ఏదైనా మంచిపని చేశావనుకో, అది వ్యాపారం అవుతుంది కాని పుణ్యకార్యం అవుతుందా?"

మరుసటిరోజు లక్ష్మీనారాయణకు నాన్నమ్మ రెండణాలు ఇచ్చింది. ఆపైసలతో అతను మార్కెట్టుకెళ్లి రెండు నారింజపళ్లు కొన్నాడు. మిత్రుడు మోతీలాల్‌కు జ్వరం వచ్చిన సంగతి తెలిసి అతన్ని చూడటానికిని వెళ్లాడు. మోతీలాల్‌ను పరీక్షించడానికని వైద్యుడు వచ్చాడు. వైద్యుడు మోతీలాల్‌ను పరీక్షించి, మందు ఇచ్చిన తర్వాత అతనికి 'నారింజ పళ్లరసం ఇమ్మని అతని తల్లితో చెప్పాడు. ఆమె చాలా పేదరాలు. "నేను కూలీనాలీ చేసి సంసారం నెట్టుకొస్తున్నాను. కొడుకు జబ్బు పడటం వల్ల చాలా రోజులనుంచి పనికి కూడా వెళ్లటం లేదు. నారింజపళ్లు



కొనడానికి నావద్ద చిల్లిగవ్వకూడా లేదు." - అంటూ ఆమె ఏడుస్తూ చెప్పింది.

లక్ష్మీనారాయణ తనవద్దవున్న రెండు నారింజపళ్లను ఆమె చేతుల్లో పెట్టాడు. ఆమె అతన్ని మనసారా దీవించింది. ఇంటికి వచ్చిన తర్వాత అతను డబ్బీ తెరిచిచూస్తే అందులో రెండు రూపాయలు మెరుస్తూ కనిపించాయి.

ఓ రోజు లక్ష్మీనారాయణ ఆడుకొంటున్నాడు. అతని చెల్లెలు వచ్చి అతని ఆటబొమ్మలను ఎత్తుకొనసాగింది. అతను ఆమెను అడ్డుకొన్నాడు. ఆమె బొమ్మలు విడవలేదు. అతను చెల్లెలుకు నాలుగు అంటించాడు. పాపం ఆమె ఏడుపు లంకించుకొంది. తర్వాత అతను లోపలికి వెళ్లి డబ్బీమూత తీసి చూస్తే, అందులో వున్న చాలా రూపాయలు మాయమైపొయ్యాయి. అతనికి పశ్చాత్తాపం కలిగింది. ఇకమీదట చెడ్డపనులు చేయకూడదని గట్టిగా తీర్మానించుకొన్నాడు.

మంచిపనులు చేసేవాడి స్వభావం మంచి గానే వుంటుంది. అలాగే చెడ్డపనులు చేసేవాడి స్వభావం చెడ్డగా వుంటుంది. చెడ్డవాడికి చెడ్డపనులు చేయడంలోనే పరమానందం. మంచిపనులు చేసేవాడి హృదయం నిర్మలంగా, పవిత్రంగా వుంటుంది. అతనికి చెడ్డపనులు చేయాలన్న తలంపే కలగదు. లక్ష్మీనారాయణ మొదట్లో డబ్బు మీద ఆశతో మంచిపనులు చేసేవాడు. రానురానూ అతని మనస్సు మంచిపనులు చేయాలన్న వైపే పోసాగింది. మంచి పనులు చేయగా చేయగా అతని డబ్బీ రూపాయలతో నిండిపోయింది. స్వర్గం చూడాలన్న కోరికతో ఉప్పొంగుతూ, అతను డబ్బీ తీసుకొని తోటలోకి వెళ్లాడు.

ఓ ముసలి సాధువు చెట్టుకింద కూర్చొని ఏడుస్తూవుండటం

చూశాడు. అతను సాధువు దగ్గరకు పరుగెత్తి కెళ్లి "స్వామీ! మీరు ఎందుకు ఏడుస్తున్నారు?" అని అడిగాడు.

అప్పుడు సాధువు ఇలా అన్నాడు -'బాబూ! నీవద్దవున్న డబ్బీలాంటిదే నావద్దా వుండేది. నేను ఎన్నోరోజులు కష్టపడి దాన్ని రూపాయలతో నింపాను. ఆ రూపాయలతో ఎంచక్కా స్వర్గం చూడొచ్చని ఎంతో ఆశపడ్డాను. కాని నా ఖర్మం కొద్దీ



నదిలో స్నానం చేసేటప్పుడు ఆ డబ్బీ కాస్తా నీటిలో పడిపోయింది.'



'స్వామీ! మీరెందుకు బాధపడతారు? నాడబ్బీనిండా రూపాయలున్నాయి. దయచేసి దీన్ని మీరు స్వీకరించండి' లక్ష్మీనారాయణ వినయంగా పలికాడు.

'ఈ డబ్బీని నీవు ఎంతో కష్టపడి నింపావు. దీన్ని నాకు ఇస్తే, నీకు బాధ కలుగుతుంది కదా?' సాధువు అన్నాడు.

'స్వామీ! నాకు ఎలాంటి బాధా కలగదు. నేను ఇంకా బాలుణ్ణి, ఇంకా ఎన్నో ఏళ్లు బతుకుతాను. అలాంటప్పుడు ఇలాంటి డబ్బీలు ఎన్నైనా నింపగలను. మీరు పెద్దవారయ్యారు. మీరు ఇంకో డబ్బీ నిండా రూపాయిలు నింపగలరో లేదో చెప్పటం కష్టం. అందువల్ల దయవుంచి ఈ డబ్బీ తీసుకోండి.' లక్ష్మీనారాయణ ప్రార్థించాడు.

సాధువు డబ్బీతీసుకొని తనచేత్తో లక్ష్మీనారాయణ కళ్లను మృదువుగా నిమిరాడు. అతని కళ్లు మూత పడ్డాయి. అతనికి స్వర్గం కనపడసాగింది -నాన్నమ్మ వర్ణించిన స్వర్గం కంటే ఎన్నో వేలరెట్లు అందమైన స్వర్గం!

లక్ష్మీనారాయణ కళ్లు తెరిచాడు. సాధువుకు బదులుగా స్వప్నంలో సాక్షాత్కరించే దేవత ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

'నాయనా! మంచిపనులు చేసేవాళ్లకు ఇలా స్వర్గం కళ్లెదుట నిలుస్తుంది. నీవు ఇలాగే మంచిపనులు చేస్తూ వుండు. చివరికి స్వర్గం చేరుకొంటావు.' ఈ మంచిమాటలు చెప్పి దేవత మాయమై పోయ్యాడు.

నీతి : మంచివాళ్లకు స్వర్గసుఖాలు లభిస్తాయి

~~*~~

# 10. అందరి కంటే పుణ్యాత్ముడు

కాశి ప్రాచీనకాలం నాటి ప్రసిద్ధ క్షేత్రం. సంస్కృత విద్యకు పేరుమోసిన పురాతన కేంద్రం. దీనికి విశ్వేశ్వర నగరం లేదా విశ్వేశ్వరపురం అనేపేర్లు కూడా వున్నాయి. విశ్వేశ్వరదేవాలయం ఆ నగరంలోని ప్రాచీన పుణ్య ప్రదేశాల్లో ఒకటి. ఓరోజు విశ్వేశ్వరుడు పూజారికి కలలో కనపడ్డాడు. పండితులను, సాధువులను, పుణ్యాత్ములను ఓ రోజు పిలిపించి సభ ఏర్పాటు చెయ్యమని చెప్పాడు. మరుసటి దినమే పూజారి ఈ సంగతి నగరమంతా చాటింపు వేయించాడు.

కాశి లోని పండితులు, సాధువులు, సత్పురుషులు, పుణ్యాత్ములు గంగానదిలో స్నానం చేసి గుడికి వచ్చారు. అందరు దేవునికి జలాభిషేకం చేశారు. ప్రదక్షిణలు చేశారు. సభామంటపంలో, బయటా క్రిక్కిరిసారు. అందరూ రాగానే పూజారి తనకు వచ్చిన కల వివరించారు. అందరు బిగ్గరగా 'హరహర మహాదేవా!' అంటూ జయ జయ ధ్వానాలు చేసి, పరమేశ్వరుణ్ణి ప్రార్థించసాగారు.

పరమశివునికి హారతి ఇచ్చారు. గంటలు గణగణా మోగాయి. ప్రార్థనలు ముగిశాయి. ప్రశాంతత నెలకొనింది. ఉన్నట్లుండి గుడి అంతటా వెలుగు నిండింది. విశ్వేశ్వరుని లింగం ప్రక్కన తళతళా మెరుస్తూ రత్నఖచితమైన ఓ బంగారురేకు కనపడింది. ఆ రత్న కాంతుల వల్లే గుడిలో అంత వెలుగు! అర్చకుడు రత్నఖచితమైన బంగారు రేకు అందుకొన్నాడు. ఆ రేకులోని ముత్యాల్లాంటి అక్షరాలను ఇలా చదివాడు–'అందరికంటే దయాశీలికి, పుణ్యాత్మునికి విశ్వేశ్వరుడు ఇచ్చిన కానుక ఇది'.





పూజారి గొప్ప త్యాగశీలి. నిజమైన భక్తుడు కూడా. ఆయన ఆ రేకును అందరికీ చూపించాడు. 'ప్రతిసోమవారం ఇక్కడ పండితసభ జరుగుతుంది. అందరికంటే పుణ్యాత్ముడు, దయాళువు అని ఎవరు తన్ను నిరూపించుకొంటారో వారికి ఈ బంగారురేకు ఇవ్వబడుతుంది'– అని పూజారి చెప్పాడు.

దేశంలోని నలుమూలలా ఈ వార్త వ్యాపించింది. దూరదూర ప్రాంతాలనుంచి మునులు, త్యాగధనులు, వ్రతదీక్షాపరులు, ధర్మాత్ములు కాశీ నగరానికి రాసాగారు. ఎన్నో నెలలు క్రమం

తప్పకుండా చాంద్రాయణ వ్రతం చేసిన ఓ బ్రాహ్మణుడు స్వర్ణపత్రం తీసుకోవడానికి ముందుకొచ్చాడు. ఆయన స్వర్ణపత్రం చేతికి అందుకొనేసరికి అది కాస్తా మట్టిపలకగా మారిపోయింది. దాని ధగధగలు మాయమైపోయాయి. ఆయన సిగ్గుపడి దాన్ని పూజారికి తిరిగి ఇచ్చాడు. పూజారి చేతుల్లోకి వెళ్లగానే అది మునుపటి కాంతితో మిలమిల లాడసాగింది.

ఓ పెద్దమనిషి ముందుకు వచ్చాడు. ఆయన ఎన్నో బళ్లు గుళ్లు కట్టించాడు. ఎన్నో చోట్ల సేవామందిరాలు స్థాపించాడు. ఎముకలేని చేత్తో అడిగిన వారికల్లా దానధర్మాలు చేశాడు. ఆయనపేరు పత్రికల్లో తాటికాయలంతేసి అక్షరాల్తో పడుతూ వుంటుంది. ఆయన అపరదానకర్ణుడిగా పేరు మోశాడు. ఆయన బంగారురేకు అందు కుందామని ముందుకు అడుగేశాడు. ఆయన చెయ్యి తాకగానే బంగారురేకు మట్టిపలకగా మారిపోయింది. ఆయనను చూసి పూజారి ఇలా అన్నాడు -'మీరు పేరుప్రతిష్ఠలు, గౌరవసన్మానాలు ఆశించి దానధర్మాలు చేస్తున్నట్లు తోస్తొంది. పేరు ఆశించి చేసే దానధర్మాలు నిజమైనని కావు.'

ఇలాగ ఎంతో మంది బంగారురేకు తీసుకోవాలని ముందు కొచ్చారు. కాని ఎవ్వరికీ అది దక్కలేదు. అది ఎవరు తాకినా మట్టిపలకగా మారిపోతుండేది. ఇలాగే ఎన్నో నెలలు గడిచి పొయ్యాయి. ఎంతోమంది బంగారురేకు పొందాలనే ఆశతో విశ్వేశ్వర ఆలయం దగ్గరనే విరివిగా దానధర్మాలు చేయసాగారు. కాని వాళ్లకు కూడా బంగారురేకు లభించలేదు.

ఓ రోజు ఓముసలి రైతు విశ్వేశ్వరుని దర్శనం చేసుకోవడానికి వచ్చాడు. అతను పల్లెటూరి మనిషి. మాసిపోయిన, చినిగిన బట్టలు వేసుకొన్నాడు. భగవంతుడిని దర్శించాలన్నదే అతని ఆశయం. వీపుమీద ఓ చిరిగిన దుప్పటి, తువ్వాల్లో పిడికెడు



పేలపిండి. దేవాలయం సమీపంలో కలిగినవాళ్లు పేదసాదలకు బట్టలు, తినుబండారాలు పంచిపెడ్తున్నారు. కాని గుడికి కొంత దూరంలో ఓ కుష్ఠురోగి లేవలేనిస్థితిలో బాధతో మూలుగుతున్నాడు. అతనిదేహం నిండా చీము కారుతున్న పుండ్లు. అతను అన్నం ముఖం చూసి ఎంత కాలమై పోయిందో! కాని అతని గోడు పట్టేందు కొనేదెవరు? ఆ కుష్ఠురోగిని చూసి ముసలిరైతు గుండె చెరువైంది. అతను తాను తెచ్చిన పిడికెడు పేలపిండిని అతనికి ఇచ్చి, తన దుప్పటిని అతనిపై కప్పాడు. తర్వాత దేవుణ్ణి దర్శించుకొందామని గుడిలోనికి వెళ్లాడు.

గుడి పూజారి ఓ కొత్త నియమం పెట్టుకొన్నాడు. ప్రతి సోమవారం గుడిలోకి వచ్చిన ప్రతిభక్తుని చేతికి ఆ బంగారు రేకును తప్పనిసరిగా అందించేవాడు. నియమం ప్రకారం పూజారి దైవదర్శనం చేసుకున్న తర్వాత ముసలిరైతుకు బంగారు రేకును అందించాడు. ఏమాశ్చర్యం! ముసలిరైతు తాకగానే ఆ బంగారు రేకు ధగద్ధగాయ మానంగా ప్రకాశించసాగింది. భక్తాదులు అతన్ని ప్రశంసించారు.

అప్పుడు పూజారి రైతుతో ఇలా అన్నాడు- 'ఈ బంగారు రేకును ఆ భగవంతుడు నీకు కానుకగా ఇచ్చాడు. నిస్వార్థంగా, నిర్మల హృదయంతో పేదసాదలకు ఎవరు ఉపకారం చేస్తారో, కష్టాల్లో వున్నవాళ్లను ఆదుకొంటారో వాళ్లే అందరికంటే పుణ్యాత్ములు.'

నీతి: పరోపకారానికి మించిన పుణ్యం లేదు.

--*--

# 11. లోభం మహాచెడ్డది

ఓ వర్తకుడు బేరగానికి తేనె అమ్ముతున్నాడు. అకస్మాత్తుగా అతని చేతిలోనుంచి తేనెగిన్నె జారి కింద పడిపోయింది. గిన్నెలోనుంచి తేనె వొలికి నేలమీద పడింది. వ్యాపారి సాధ్యమైనంత తేనె గిన్నెలోనికి పైపైన ఎత్తి పోసుకొన్నాడు. కాని కొంత తేనె మాత్రం నేలపాలయ్యింది.

తేనె తీపిదనానికి ఆశపడి ఈగలు గుంపులు గుంపులుగా వచ్చి తేనెమీద వాలాయి. తియ్యని తేనె రుచిమరిగి ఈగలు గబగబా తేనె జుర్రుకోసాగాయి.

కడుపు నిండిన తర్వాత ఈగలు ఎగిరిపోవాలని ప్రయత్నించాయి. కాని రెక్కలు తేనెకు అంటుకుపొయ్యాయిగా! ఎగరాలని ఎంతగానో ప్రయత్నించాయి. కాని ఎగరలేకపొయ్యాయి. పైకెగరాలని ప్రయత్నించే కొద్దీ తేనెకు మరింత అంటుకుపొయ్యాయి పాపం!

ఎన్నో ఈగలు తేనెలో విలవిలలాడుతూ చనిపొయ్యాయి. అయినా తేనెమీది ఆశకొద్దీ కొత్తగా ఈగలు గుంపులు గుంపులుగా రావటం మానలేదు. విలవిలలాడుతున్న, చనిపోయిన ఈగలను చూసైనా అవి బుద్ధి తెచ్చుకొన్నాయా?

ఈగల అవస్థ, అవివేకం చూసి వర్తకుడు ఇలా అన్నాడు- 'జిహ్వాచాపల్యానికి, లోభానికి గురయ్యేవారు ఈ





ఈగల్లాగానే మూర్ఖులు. క్షణికమైన ఆనందాన్ని ఆశించి, లోభం కొద్దీ తమ ఆరోగ్యం పాడు చేసుకొంటారు. నానా రోగాలతో అవస్థపడుతుంటారు. త్వరలో చావు కొనితెచ్చుకొంటారు.'

నీతి: లోభం కష్టనష్టాలకు గురిచేస్తుంది.

~~*~~

# 12. ఐకమత్యమే మహాబలం

శంకరయ్యకు ఐదు మంది కొడుకులు శివరామ్, శివదాస్, శివశంకర్, శివప్రసాద్, శివకుమార్. ఈ ఐదుమంది తమలో తాము కొట్లాడుకొనేవారు. చీటికిమాటికి తిట్టుకోవడం, కొట్టుకోవడం జరుగుతుండేది.

శంకరయ్య కొడుకుల జగడాలు చూసి విసిగిపొయ్యాడు. వాళ్లకు బుద్ధిచెప్పాలని, ఓరోజు వాళ్లందరినీ దగ్గరకు పిలిచాడు. సన్నగా చీల్చిన కట్టెలను ఓమోపుగా కట్టాడు. దాన్ని వాళ్లకు చూపించి "మీలో ఎవరైనా ఈమోపును విరగ్గొట్టగలిగితే. వాళ్లకు ఓరూపాయి బహుమతిగా ఇస్తాను" - అని చెప్పాడు.

నేనంటే నేనని ఐదుమంది కొడుకులు కట్టెలమోపు విరగ్గొట్టడానికి పోటీపడుతూ కొట్లాడుకోసాగారు. బహుమతిని ఎవరు ఎగరేసుకుపోతారో అని ఆ ఐదుమందికీ ఆత్రమే! శంకరయ్య ఇది చూసి "అలాకాదు. మొదట శివకుమార్‌కు అవకాశమిద్దాం"- అన్నాడు.

శివకుమార్ శక్తినంతా కూడగట్టుకొని మోపును విరచాలని ప్రయత్నించాడు. కళ్లుమూసుకొని, పళ్లు బిగపట్టి తనబలమంతా చూపించాడు. వాళ్లంతా చెమటలు కమ్మిందేగాని కట్టెలమోపు విరగలేదు. తర్వాత శివప్రసాద్ ప్రయత్నించాడు. ఎంత ప్రయత్నించినా మోపు విరగలేదు. ఇలాగే ఒకరితర్వాత ఒకరు శాయశక్తులా ప్రయత్నించారు. కాని ఎవరూ కట్టెలమోపును విరగ్గొట్టలేకపొయ్యారు.

శంకరయ్య మోపు విప్పి ఒక్కో కుమారునికి ఒక్కో కట్టె ఇచ్చాడు. అందరూ కట్టెలను పటపటా తుంచివేశారు. అప్పుడు శంకరయ్య ఇలా అన్నాడు -"చూశారా, ఈ కట్టెలన్నీ





ఒకటిగా వున్నప్పుడు మీరెవ్వరూ వాటిని విరగ్గొట్టలేక పొయ్యారు. కాని అవి విడిపొయ్యినప్పుడు మీరు సునాయాసంగా తుంచగలిగారు. మీరు ఇలా పరస్పరం తన్నుకుచస్తుంటే బయటివాళ్లు మీకు ఇబ్బందులు కలిగిస్తారు. పైగా మిమ్మల్ని పైకి రాకుండా చేస్తారు. అలాకాకుండా, మీరంతా కలిసి కట్టుగా వున్నారంటే, ఎవరూ మీజోలికే రారు. మీరంటే భయపడి దూరంగా వుంటారు."

ఆరోజునుంచి శంకరయ్య కొడుకులు ఐదుమంది ఎలాంటి కొట్లాటలు లేకుండా, కలిసికట్టుగా, హాయిగా వుండసాగారు.

నీతి: ఐకమత్యమే మహాబలం.

~~*~~

# 13. పనికిరాని వైద్యుడు

సుబ్బయ్య కొడుకు సోము జబ్బుపడ్డాడు. మలమలమాడే ఎండలో మామిడికాయలు కోసుకొందామని ఇంటినుంచి మెల్లగా జారుకొన్నాడు. ఎండవడతగిలి జ్వరంవచ్చింది. వొళ్లంతా సలసల కాగుతోంది. సుబ్బయ్య వైద్యునికి కబురు పెట్టాడు.

వైద్యుడు సోము నాడిపట్టుకు చూశాడు. "మీ అబ్బాయికి ఎండవడసోకింది. మీ కుర్రాడు అల్లరివాడుగా కనపడుతున్నాడు. అసలు మలమలమాడే ఎండలో బయటికి ఎందుకెళ్లాడు? ఇదేం బాగలేదు. పెద్దలమాటలు వినకపోతే, పిల్లలకు ఇలానే శాస్తి జరుగుతుంది. కావాల్సిందే" - అని చివాట్లు పెట్టాడు.

అంతటితో ఆగితేనా? దండకం చదువుతూ పొయ్యాడు. సుబ్బయ్యకు ఇది నచ్చలేదు ఆయన వైద్యునికి ఓ నమస్కారం పెట్టి "అయ్యా, మిమ్మల్ని పిలిపించి ఓ పెద్ద పొరపాటు చేశాను. ఇదిగో చెంపలేసుకొంటున్నాను. ఇదిగో మీఫీజు తీసుకొండి. ఇంక మీరు దయచెయ్యండి. నేను మా అబ్బాయికి చికిత్స చేసేందుకు డాక్టరును పిలిపిస్తాను. జ్వరం వచ్చిన వాడిని మీరు తిట్టిపోస్తూ, వాడికి మరింత బాధ కలిగిస్తున్నారే కాని వాడి అవస్థచూసి జాలిపడటం లేదు." అని చెప్పాడు.





వైద్యుడు సిగ్గుతో తలొంచుకొని వెళ్లిపొయ్యాడు. కష్టాల్లో వున్నప్పుడు, వాళ్ల తప్పులు ఎత్తిచూపి, సలహాలిచ్చి, వాళ్లను మరింత కష్టపెట్టకూడదు. కష్టాల్లో వున్నవాళ్లపట్ల సానుభూతి చూపి, వాళ్లను ఆదుకోవటమే మానవధర్మం.

**నీతి: సానుభూతి కొండంత వూరట.**

~~*~~

# 14. పశ్చాత్తాపం

ఓ వ్యాపారి వద్ద రెండు గుర్రాలుండేవి. అతను వాటిపై సరుకులు వేసుకొని, కొండలు గుట్టలు దాటి వూరూరు తిరిగి వ్యాపారం చేసేవాడు. ఓరోజు ఆరెండు గుర్రాల్లో ఓదానికి జబ్బుచేసింది. ఈసంగతి వ్యాపారికి తెలియదు. అతను రెండు గుర్రాలపై ఉప్పు, బెల్లం, పప్పు, బియ్యం మూటలు సరిసమానంగా వేసి, పొరుగూరికి ప్రయాణం కట్టాడు.

మిట్టపల్లాల కొండదారి. జబ్బుపడ్డ గుర్రం బరువు మోయలేక అవస్థపడుతూంది. అది తోటిగుర్రంతో ఇలా అంది - 'ఈరోజు నా వొంట్లో బాగులేదు. నేను నావీపుమీదవున్న ఓ మూటను గిరాటు వేస్తాను. నీవు ఇక్కడే నిల్చుకొనివుండు. అప్పుడు మనయజమాని ఆ బస్తాను నీవీపు మీదికి ఎక్కిస్తాడు. నా భారం కొంత తగ్గితే చాలు, నేను నీతోపాటు నడవగలను. నీవు ఆగకుండా ముందుకుపోతే, యజమాని ఆ మూటను నా వీపుమీదికి ఎత్తుతాడు'.

అప్పుడు రెండో గుర్రం ఇలా అంది -"నీబరువు మోయడానికని నేనెందుకు నిలబడాలి? నేనేం తక్కువ బరువ మోస్తున్నానా? నా వంతు బరువు మాత్రం నేను మోస్తాను. అంతే."

జబ్బుతో వున్న గుర్రం మాట్లాడలేదు. దాని జబ్బు మరింత ఎక్కువ కాసాగింది. ఓరాయి కాలికి తగిలి, గుర్రం కిందపడి లోయలోకి దొర్లిపొయ్యింది.





ఓ గుర్రం చనిపోవడంతో వ్యాపారికి ఎంతో బాధ కలిగింది. అతను కొన్సేపు అక్కడే విచారంగా నిలబడ్డాడు. తర్వాత కిందపడ్డ మూటలను, రెండో గుర్రం వీపు మీదికి ఎత్తాడు. అప్పుడా గుర్రం తాను చేసిన తప్పుతెలిసికొని, లోలోన మథనపడసాగింది - 'నా మిత్రుడు అడిగిన వెంటనే ఓమూట బరువు నేను మోసుకొని వుంటే, నాకీ కష్టం వచ్చివుండేది కాదు.'

కష్టాలు వచ్చినప్పుడు మిత్రులను ఆదుకొనకపోతే, తర్వాతమనం పశ్చాత్తాప పడాల్సివస్తుంది.

**నీతి : ఆపదలో వున్న వాళ్లను ఆదుకొనాలి.**

~~*~~

# 15. బ్రహ్మదేవుని సంచులు

సమస్త చరాచరప్రపంచాన్ని సృష్టించిన బ్రహ్మదేవుడు ఓసారి మానవుణ్ణి తనవద్దకు పిలిచి 'నీకేమి కావాలి?' అని అడిగాడు.

మానవుడు ఇలా బదులిచ్చాడు-'నేను బాగాపైకి రావాలి. సుఖశాంతులతో తులతూగాలి. లోకులంతా నన్ను పొగడాలి'.

బ్రహ్మదేవుడు మానవుని ముందు రెండు సంచులు వుంచాడు. ఇలా అన్నాడు -'ఈ రెండు సంచుల్ని తీసుకో, ఒక సంచిలో నీ పొరుగువాని తప్పులున్నాయి. దాన్ని వీపుమీద వేసుకో. దాన్ని ఎప్పుడూ విప్పకుండా వుండాలి. నీవూచూడకూడదు. ఇతరులకూ చూపించకూడదు. రెండో సంచిలో నీ తప్పులున్నాయి. దాన్ని నీ ఎదుట వేలాడ తీసుకొనివుంచు. దాన్ని పదే పదే విప్పి చూస్తూ వుండు.'






మనుష్యుడు రెండు సంచులను తీసుకొన్నాడు. కాని అతను ఓ పొరపాటు చేశాడు. తన తప్పులున్న సంచిని వీపుమీదికి ఎత్తుకొన్నాడు. దాని మూతిని గట్టిగా బిగించివుంచాడు. పొరుగు మనిషి తప్పులున్న సంచిని ఎదురుగుండా వేలాడదీశాడు. అప్పుడప్పుడు దాని మూత విప్పి చూస్తూ, ఇతరులకు కూడా చూపిస్తూ వుండేవాడు. దీనివల్ల జరిగింది ఏమిటంటే బ్రహ్మదేవుడు ఇచ్చిన వరం తలకిందులయింది. అతను చితికి పోసాగాడు. అతనికి సుఖశాంతులు లభించకపోగా దుఃఖం, అశాంతి ఎక్కువ కాసాగాయి. లోకులు అతన్ని దూషించసాగారు.

ప్రతి మనిషి తనతప్పులు దిద్దుకోవాలి. అప్పుడే అతను పైకి వస్తాడు. అతనికి సుఖశాంతులు లభిస్తాయి. ప్రజలు అతన్ని మనసారా ప్రశంసిస్తారు. నీవు ఇరుగుపొరుగువారి తప్పులను వెతికిచూపడం మానుకో. నీతప్పులను తెలుసుకొని దిద్దుకొనడం నేర్చుకో.

నీతి: తమతప్పులను దిద్దుకొనే వాళ్లే ఉత్తములు.

~~*~~

# 16. నిజమైన గెలుపు

ఓ వూళ్లో విజయసింహుడనే ఓ రైతు వుండేవాడు. అతను సింహంలాగా భయంకరంగా వుండేవాడు. పొగరుపోతు కూడా. ప్రతి చిన్న విషయానికీ అతను ఇతరులతో పోట్లాడేవాడు. ఊరిలోని వాళ్లతో అతను ఎప్పుడూ ప్రేమగా మాట్లాడేవాడు కాదు. అతను ఎవరిళ్లకూ వెళ్లేవాడు కాదు. ఎవరైనా దారిలో ఎదురైతే తాను వాళ్లకు నమస్కారం చేసేవాడు కాదు. ఊళ్లోని రైతులు అతన్ని పొగరుపోతుగా జమకట్టే అతనికి దూరంగా వుండేవారు.

దయాశంకరుడనే రైతు ఎక్కడినుంచో వచ్చి ఆ వూళ్లో కాపురం వుండసాగాడు. అతను చాలా నెమ్మదస్తుడు. మంచివాడు. అతని మాటల్లో వినయం వుట్టిపడేది. అతను ప్రతిమనిషికీ తనచేతనైనంత సాయం చేసేవాడు. ఊళ్లోని రైతులు అతన్ని ఎంతో గౌరవించేవారు. అవసరమైనప్పుడు అతని సలహాలు తీసుకొని, అలానే నడిచేవారు.

ఓరోజు వూళ్లోని రైతులు దయాశంకరునితో ఇలా అన్నారు -'అన్నా, నీవు పొరపాటున కూడా విజయసింహుని ఇంటివైపు వెళ్లొద్దు. సాధ్యమైనంతవరకు అతనికి దూరంగా వుండు. అతను జగడాలమారి'.

'విజయసింహుడు నాతో తగవు పెట్టుకొంటే నేను అతన్ని చంపేస్తాను'- దయాశంకరుడు నవ్వుతూ అన్నాడు.

అతని మాటలకు రైతులు నవ్వారు. దయాశంకరుడు చాలా మెత్తని మనిషనీ, చీమకు కూడా అపకారం తలపెట్టని వాడనీ వాళ్లకు బాగా తెలుసు. చంపడం కాదుకదా, అతను ఎవరినీ



తిట్టలేదని కూడా వాళ్లకు తెలుసు. ఈ సంగతి ఎలాగో విజయసింహునికి తెలిసింది. కోపంతో అతని ముఖం బాగా ఎర్రబడింది. అతను ఎలాగైనా సరే, దయాశంకరునితో పేచీ పెట్టుకోవాలని ఎదురుచూడసాగాడు. అతను దయాశంకరుని పొలంలో తన ఎద్దుల్ని తోలాడు. ఎద్దులు పొలాన్ని చాలా పాడు చేశాయి. కాని దయాశంకరుడు ఎద్దుల్ని బయటికి తరిమివేశాడే కాని విజయసింహుని పల్లెత్తుమాట కూడా అనలేదు.

విజయసింహుడు దయాశంకరుని పొలంలోని నీళ్లగొట్టాల్ని పాడు చేశాడు. నీళ్లు వృర్థం అయ్యాయి. దయాశంకరుడు కిమ్మనకుండా గొట్టాల్ని మరమ్మత్తు చేసుకొన్నాడు. ఇలాగే విజయసింహుడు రోజూ ఏదో ఓవిధంగా దయాశంకరునికి నష్టం కలిగించసాగాడు. కాని దయాశంకరుడు కొండంత ఓర్పు ప్రదర్శించాడు.

ఓ రోజు దయాశంకరుని బంధువొకరు అతని ఇంటికి తియ్యని బొప్పాయి పళ్లు పంపించారు. దయాశంకరుడు వూళ్లోని మిత్రులందరి ఇళ్లకు ఒక్కొక్కపండు చొప్పున పంచిపెట్టాడు. అలాగే విజయసింహుని ఇంటికి కూడా ఓ పండు పంపాడు. 'నేనేం బిచ్చగాణ్ణి కాదు. నాకు ఎవ్వరూ దానం చేయక్కర్లేదు' అని విజయసింహుడు ఆపండును తిప్పిపంపాడు.

వానాకాలం వచ్చింది. విజయసింహుడు బండిలో ధాన్యం నింపుకొని పొరుగూరినుంచి వస్తున్నాడు. దారిలో కాలువ దాటుతూ వుండగా బండి బురదలో ఇరుక్కుపోయింది. విజయసింహుని ఎద్దులు బక్కప్లల్చవి. బురదగుంటనుంచి బండిని లాగలేకపోయ్యాయి. ఈ సంగతి వూరివాళ్లకి తెలిసింది.

'వాడికి శాస్తి కావాల్సిందే. అలాగే పడుండనీ' అంటూ వూరివాళ్లు శాపనార్థాలు పెట్టారు.

కాని దయాశంకరుడు తనబలిష్ఠమైన ఎద్దులను తోలుకొని కాలువవైపు బయలుదేరాడు. అప్పుడు వూరివాళ్లు అతన్ని ఆపి, 'దయాశంకర్! విజయసింహుడు నీకెంతో హాని కలిగించాడు. నాతో కొట్లాడటానికి వచ్చాడంటే, అతన్ని నేను చంపివేస్తానన్నావు. మరి ఇప్పుడేమో అతనికి సాయం చేయడానికి వెళ్తున్నావు? ఏమిటిదంతా?' అని అడిగారు.

'నేనీరోజు అతన్ని తప్పకుండా చంపేస్తాను. రేపు పొద్దున్నే చూద్దురుగాని' అని చెప్పాడు దయాశంకరుడు.





దయాశంకరుడు ఎద్దులతో రావటాన్ని చూశాడు విజయసింహుడు. పొగరుగా దయాశంకరునితో ఇలా అన్నాడు -'నీవు నీ ఎద్దులు తోలుకొని వెనక్కివెళ్ళు. నాకు ఎవరిసాయం అక్కర్లేదు'.

దయాశంకరుడు బదులిచ్చాడు- 'నీవు నోటికి వచ్చినట్లు తిట్టు, అతిగా అయితే కొట్టు. కాని నన్ను తిరిగి వెళ్లమనొద్దు. నీవు ఇప్పుడు కష్టంలో వున్నావు. నీబండి బురదలో చిక్కుకొని పోయింది. చీకటి పడుతూంది. నీమాటలు నేను ఖాతరు చెయ్యను'.

దయాశంకరుడు విజయసింహుని ఎద్దులను విడిపించి, తన ఎద్దులు బండికి కట్టాడు. అవి ఒక్క వూపుతో బండిని బురదనుంచి బయటికి లాగాయి. విజయసింహుడు తన బండిని తోలుకొని ఇల్లు చేరుకొన్నాడు. అతని మనస్సు ఆరోజు నుంచి మారిపొయ్యింది. 'దయాశంకరుడు నాకు మేలుచేసి నన్ను నిజంగా చంపివేశాడు. నాలోని గర్వాన్ని అణచివేసి,నన్ను మంచివానిగా మార్చాడు.' అని విజయసింహుడు అందరితో చెప్పసాగాడు. ఇప్పుడు అతను అందరితో స్నేహంగా, మంచిగా మెలగుతున్నాడు. చెడ్డను మంచితో గెలవడమే నిజమైన గెలుపు. దయాశంకరునిదే నిజమైన గెలుపు.

నీతి: అపకారికి ఉపకారం చేయడమే గొప్ప.

## 17. మూర్ఖరాజు

అక్బరు పాదుషా బీర్‌బల్‌ను చాలా గౌరవించేవాడు. బీర్‌బల్ గొప్ప తెలివితేటలు కలవాడు. అతను తన హాస్యోక్తులతో

చక్రవర్తిని సంతోషపెట్టేవాడు. అక్బర్ బీర్‌బల్ వినోదకథలు చాలా ప్రసిద్ధమైనవి. కొన్ని కథలు మనకు గుణపాఠాలు. అలాంటి ఓకథ విందాం.

ఓసారి అక్బరు చక్రవర్తి అంతఃపురానికి వెళ్లాడు. పాదుషాగారికి ప్రియాతిప్రియమైన బేగమ్ తన స్నేహితురాలితో ఏదో మాట్లాడుతూన్నారు. ఉన్నట్టుండి పాదుషా అక్కడ ప్రత్యక్షమయ్యారు. అప్పుడు బేగమ్ లేచి నిల్చొని 'దయచెయ్యండి మూర్ఖరాజా! దయచెయ్యండి' అన్నారు.

చక్రవర్తికి కోపం వచ్చింది. కాని ఇంతకు ముందెప్పుడూ బేగమ్ ఇలా పాదుషాను అవమానించి వుండలేదు. బేగమ్ చాలా తెలివైనదని పాదుషాకు తెలుసు. ఆమె ముందువెనక చూడకుండా మాట్లాడదు. కాని బేగమ్ తనను మూర్ఖరాజు అనడానికి కారణమేమిటో తెలియలేదు. బేగమ్‌ను అడగటానికి





ధైర్యం చాలేదు. కొంతసేపు కూర్చొని చక్రవర్తి తన భవనానికి వెళ్లిపోయారు.

పాదుషా విచారంగా కూర్చొన్నారు. అప్పుడు అక్కడికి బీర్‌బల్ వచ్చాడు. బీర్‌బల్‌ను చూడగానే పాదుషా 'మూర్ఖరాజుకు స్వాగతం' అన్నారు. బీర్‌బల్ నవ్వుతూ 'సంతోషం మూర్ఖరాజా' అన్నాడు.

అప్పుడు అక్బరు పాదుషా కళ్లెరచేసి 'బీర్‌బల్ నీవు నన్ను మూర్ఖరాజా అని ఎందుకు అన్నావు?' అని అడిగారు.

బీర్‌బల్ వినయంగా ఇలా బదులిచ్చాడు -'ఐదు కారణాలవల్ల మనిషిని మూర్ఖునిగా జమకడ్తాం. ఇద్దరు వ్యక్తులు ఏకాంతంగా మాట్లాడుతున్నప్పుడు, పిలవకనే ఎవరైనా వాళ్లమధ్యకు వెళ్లినా, ముందుగా తెలుపకుండా వెళ్లినా అతన్ని మూర్ఖుడంటాం. ఇద్దరు మనుషులు పరస్పరం మాట్లాడుతున్నప్పుడు, వాళ్లమాటలు జరుగుతుండగా ముందే మూడో వ్యక్తి జోక్యం కల్పించుకొని ఆ సంభాషణలో దూరబడితే అతన్ని మూర్ఖుడంటాం. ఎవరైనా ఎదుటి మనిషితో మాట్లాడుతున్నప్పుడు, అతని మాటలు పూర్తిగా వినకుండా మధ్యలో మాట్లాడే మనిషిని కూడా మూర్ఖుడని పిలుస్తాం. అకారణంగా, అనవసరంగా ఇతరులను దూషించే వ్యక్తులను కూడా మూర్ఖులంటాం. అలాగే మూర్ఖుల వద్దకు వెళ్లేవాళ్ళు, మూర్ఖులతో కలిసి మెలిసి తిరిగేవాళ్ల కూడా మూర్ఖులే'.

అక్బర్ పాదుషా బీర్‌బల్ మాటలువిని చాలా సంతోషించారు.

నీవు ఎప్పుడూ ఇలాంటి తప్పులు చేయొద్దు. అలా చేశావో, లోకులు నిన్ను కూడా మూర్ఖుడు అంటారు. ఈ మాటలను బాగా జ్ఞాపకముంచుకో.

నీతి: సమయం, సందర్భం తెలుసుకొని వ్యవహరించాలి.

~~*~~

# 18. వెళ్లండి-రండి

ఓ వూళ్లో శంకరయ్య అనే షావుకారు వుండేవాడు. శంకరయ్యకు చాలా పొలాలు వుండేవి. ఆ పొలాల్లో చాలామంది జీతగాళ్లు, కూలీలు పనిచేసేవాళ్లు, శంకరయ్య చాలా సోమరి. అతను ఎప్పుడూ భూములవైపు వెళ్లేవాడు కాడు. అతను పనంతా నౌకర్లమీద వేసి నిశ్చింతగా వుండేవాడు.

నౌకర్లుచాకర్లు తమకు తోచినట్లు పనిచేసేవాళ్లు. కొంతసేపు పొలాల్లో పనిచేసేవాళ్లు. మరి కొంతసేపు ఇళ్లల్లో కాలం వెళ్లబుచ్చేవాళ్లు. పొలాలను సరిగ్గా దున్నటంకాని, పైరుకు నీళ్లుపెట్టడం కాని, ఎరువులు వేయడం కాని సరిగ్గా చేసేవాళ్ల కాదు. విత్తనాలు చల్లటంలో కాని, కలుపు తీయడంలో కాని ఎలాంటి శ్రద్ధా చూపేవాళ్లు కాదు. ఇన్ని కారణాలవల్ల రానురాను పంటల దిగుబడి తగ్గసాగింది. పాపం, శంకరయ్య కొంత కాలానికే బీదవాడయ్యాడు.

అదేవూళ్లో రామయ్య అనే మరోరైతు వుండేవాడు. అతనికి పొలంపుట్రా వుండేదికాదు. కాని శంకరయ్య భూముల్నే కౌలుకుతీసుకొని సాగుచేసేవాడు. కష్టపడి పనిచేసేవాడు. అతను కూలివాళ్లతో పాటు పొలాలకు వెళ్లి చెమటోడ్చి పనిచేసేవాడు. పొలాలను చక్కగా దున్నేవాడు. సకాలంలో విత్తనాలను చల్లేవాడు. ఎరువులు వేసి, కలుపు తీయడంలో శ్రద్ధచూపేవాడు. రామయ్యతోపాటు ఇంటిల్లిపాదీ వాళ్ళువాంచి పనిచేసేవాళ్లు.



పంటలు బాగా పండాయి. పన్నులు చెల్లించి, ఖర్చులన్నీ పోయి బాగాడబ్బులు మిగిలాయి. కొంతకాలానికే రామయ్య బాగా డబ్బు గడించాడు.

శంకరయ్య గొంతు దాకా అప్పుల్లో కూరుకుపొయ్యాడు. అప్పులవాళ్ల బాధ పెరిగి పొయ్యింది. పొలమూపుట్రా అమ్మాల్సి వచ్చింది. ఈసమాచారం తెలిసిన వెంటనే రామయ్య శంకరయ్య వద్దకు వచ్చాడు. అతనితో ఇలా అన్నాడు -"మీరు పొలాలు అమ్ముతున్నారని తెలిసింది. దయచేసి నాకు అమ్మండి. మిగతా వాళ్లకంటే ఎక్కువగానే ధర చెల్లిస్తాను".

శంకరయ్య నోరు వెళ్లబెట్టాడు-"రామయ్యా! ఇన్ని భూములుండే నేను అప్పుల్లో కూరుకు పొయ్యాను. సొంత భూములు లేని నీకు డబ్బెక్కడినుంచి వచ్చింది? నీవు నా భూములనే కౌలుకు తీసుకున్నావుకదా? పన్నులు చెల్లించాలి. ఇంటిఖర్చులు భరించాలి. ఈ పొలాలు కొనడానికి నీకు డబ్బెక్కడిది?"

అప్పుడు రామయ్య ఇలా బదులు చెప్పాడు -"నాకెవరూ డబ్బు ఇవ్వలేదు. నేను కష్టపడి సంపాదించినదే, కూడబెట్టినదే. మీసేద్యానికి, నాసేద్యానికి భేదముంది. మీరు నౌకర్లని చాకర్లని పనిచేయడానికి 'వెళ్లండి- వెళ్లండి' అంటారు. అందువల్ల మీ సంపద అంతా హరించుకుపోయింది. నేను పనివాళ్లకంటే ముందుగా సిద్ధమై వాళ్లను నాతోపాటు పని చేయటానికి 'రండి-రండి' అని పిలుస్తాను. అందువల్ల నాయింట్లో సిరిసంపదలు పిండాయి.



శంకరయ్యకు ఇప్పుడు తన తప్పేమిటో తెలిసివచ్చింది. అతను రామయ్యకు తన భూములు కొన్ని అమ్మి వచ్చిన డబ్బుతో అప్పులు తీర్చాడు. వొళ్లువొంచి పనిచేశాడు. కొంతకాలానికే అతని స్థితి మెరుగుపడింది. శంకరయ్య హాయిగా జీవితం గడపసాగాడు.

**నీతి : వొళ్లువంచి పనిచేస్తే బతుకే బంగారం.**

--*--



# 19. కుందేళ్లు-కప్పలు

మలమల మాడ్చే ఎండలు. ఓ సారి కొన్ని కుందేళ్ళ అడవిలోని పొదల్లో సమావేశమయ్యాయి. ఆకాలంలో పొలాల్లో ఎలాంటి పంటలు లేని కారణంగా కుందేళ్ల ఆహారం దొరక్క విలవిలలాడుతున్నాయి. ఆరోజుల్లోనే పగలు, సాయంకాలం వేటాడుతూ తిరిగే వాళ్ల కుక్కలు కూడా వాటిని చాలా వెంటాడడం మొదలెట్టాయి. మైదానాల్లోని పొదలు ఎండిపోయాయి. కుక్కలు విచ్చలవిడిగా తిరుగుతుండటం మూలానకుందేళ్లకు బయట రావాలంటే భయమేయసాగింది. దిక్కుతోచక అవి ఒకచోట సమావేశమయ్యాయి.

ఓ కుందేలు ఇలా అంది -'బ్రహ్మదేవుడు మనజాతికి చాలా అన్యాయం చేశాడు. మనల్ని చిన్నవిగా, చేతకాని ప్రాణుల్లా సృష్టించాడు. ఆదేవుడు మనకు దుప్పుల్లాగా కొమ్ములివ్వలేదు; పిల్లుల కిచ్చినట్లు వాడిగోళ్ల కూడా ఇవ్వలేదు. శత్రువులనుంచి రక్షించుకోలేని నిస్సహాయస్థితిలో వున్నాం. మనమీద ఎవరైనా దాడి చేస్తే మనకు పారిపోవడం తప్ప మరో మార్గం లేదు. భగవంతుడు కష్టాలన్నీ మనతలమీదనే రుద్దాడు.

ఇంకో కుందేలు ' ఈ కష్టాలు, ఈ భయాందోళనలు నాకొద్దు బాబు! నేను ఏ చెరువులోనో పడి చచ్చిపోవాలనుకొన్నాను' అని అంది.

మరో కుందేలు ఇలా చెప్పింది- 'నేను కూడా చచ్చిపోవాలను కొన్నాను. నేను ఇంకెంత మాత్రమూ ఈ కష్టాలు పడలేను. నేనిప్పుడేవెళ్లి చెరువులో దూకి చస్తాను.'

'మేము కూడా నీవెంటనే వస్తాం. మనమంతా కలిసి

బలికాం, కలిసే చద్దాం'. - కుందేళ్లన్నీ ఒక్కసారి బిగ్గరగా అరిచాయి. అవన్నీ చావడానికని చెరువు వైపు సాగాయి.



కుప్పలు తిప్పలుగా కప్పలు చెరువు గట్టుమీద కూర్చున్నాయి. కుందేళ్ల అలికిడి వినగానే అవి భయపడి చెంగుచెంగున చెరువులోకి దూకాయి. కప్పలు భయపడి నీళ్లలోకి దూకడం చూసి కుందేళ్లు ఆగిపోయ్యాయి. అప్పుడు ఓ కుందేలు తోటి



మిత్రులతో ఇలా అంది- 'సోదరులారా! మనం చావాల్సిన పనిలేదు. రండి. తిరిగి వెళ్దాం. దేవుని సృష్టిలో మనకంటే అల్పమైనవి, మనమంటే భయపడే ప్రాణులూ వున్నాయి. అవి కూడా బతుకుతున్నాయి. అలాంటప్పుడు మనమెందుకు చావాలి?'

ఆ మాటలు విన్న మిగతా కుందేళ్లు ఆత్మహత్య చేసుకోకుండా తిరిగి వెళ్లాయి. కష్టాలు వస్తాయి. కాని భయపడకూడదు. మనకంటే ఎక్కువగా కష్టాలు అనుభవిస్తున్నవాళ్లు మనకంటే పేదలు, రోగాలపాలైనవాళ్లు ఈ ప్రపంచంలో ఎంతోమంది వుంటున్నారు. మనం వాళ్లకంటే సుఖంగా వున్నాం. అలాంటప్పుడు మనం ఎందుకు భయపడాలి?

నీతి : ధైర్యానికి మించిన మిత్రుడులేడు.

--*--

## 20. చక్రవర్తి - తోటమాలి

నౌషేర్వా పర్షియాదేశపు చక్రవర్తి. ఆయన న్యాయపరిపాలనకు ప్రసిద్ధి పొందాడు. ఆయన ధానధర్మాలు ఎక్కువగా చేసేవాడు. ఓ రోజు ఆయన మంత్రితో షికారుకు వెళ్లాడు. ఓ తోటలో ఓ ముసలాడు ఖర్జూరం మొక్కలు నాటుతుండటం చూశాడు. చక్రవర్తి ఆ పండు ముసలి వద్దకు వెళ్లి 'నీవు తోటమాలివా? లేక యజమానివా?' అని అడిగాడు.

'నేను ఎవరికిందా పని చేయడం లేదు. ఈ తోట మా తాతముత్తాతలు నాటింది' - మాలి వినయంగా బదులిచ్చాడు.

పాదుషా -'నీవు ఈ ఖర్జూరం మొక్కలు నాటుతున్నావు. ఇవి చెట్లయి, పళ్లు కాచే దాకా నీవు బతికుంటావా?'

ఖర్జూరం చెట్టు పెరిగి పెద్దదయి ఇరవైఏళ్లు అయ్యేదాకా పళ్లనివ్వదు. ఇది అందరికీ తెలిసిన సంగతే. ముసలి తోటమాలి చక్రవర్తితో ఇలా అన్నాడు -'మాతాత ముత్తాతలు నాటిన చెట్ల పళ్లు నేనింతవరకు చాలాతిన్నాను. అందువల్ల నా తర్వాతి తరాల వాళ్లు తినేందుకని నేను మొక్కలు నాటాలి. తాను పళ్లు తినడానికే చెట్లు నాటడం స్వార్థం.'





చక్రవర్తి తోటమాలి జవాబు విని చాలా సంతోషించాడు. అతనికి బహుమతిగా రెండు బంగారు నాణేలు ఇచ్చాడు.

నీతి: పరుల కోసం పాటుపడితే పుణ్యం దక్కుతుంది.

--*--

# 21. ఉపకారికి ఉపకారం

ఓ నదిగట్టుమీద ఓ చెట్టు వుండేది. ఆ చెట్టు కొమ్మమీద ఓ పావురం కూర్చొనింది. అది నీళ్లల్లో ఓ చీమ కొట్టుకుపోతుండటం చూసింది. పాపం, ఆ చీమ నీళ్లల్లోంచి గట్టుమీదికి రావాలని ఎన్నోసార్లు ప్రయత్నించింది. కాని నీటిప్రవాహం ముందు దాని ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. ఇంకో కొన్ని క్షణాల్లో చీమనీటిలో మునిగిపోవడమే తరువాయి. ఇదంతా చూస్తున్న పావురానికి జాలికలిగింది. అప్పుడు ఆ పావురం ముక్కుతో చెట్టునుంచి ఓ ఆకును విరిచి చీమదగ్గర పడవేసింది. చీమ ఆ ఆకుపైకి వచ్చింది. ఆ ఆకు మెలమెల్లగా కొట్టుకుంటూ గట్టుదగ్గరకు వచ్చింది. గట్టుమీదికి వచ్చిన తర్వాత చీమ తనకు మేలు చేసిన పావురానికి కృతజ్ఞత తెలిపింది.

అప్పుడే ఓ పిట్టలు పట్టేవాడు అక్కడికి వచ్చాడు. చెట్టుకింద దాక్కున్నాడు. పావురం వాణ్ణి చూడలేదు. వాడు వలకట్టిన వెదురుకర్రను మెలమెల్లగా పావురం కూచున్న చోటుకు పోనివ్వసాగాడు. ఈ దృశ్యం చూసిన చీమ గబగబా చెట్టుదగ్గరకు పోయింది. పాపం! దానికి మాట్లాడ్డం చేతకాదు. లేకపోతే అది పావురాన్ని హెచ్చరించివుండేది. తనప్రాణాల్ని కాపాడిన పావురాన్ని కాపాడాలని చీమ నిశ్చయించుకొంది. అది చెట్టుకింద కూర్చున్న పిట్టలుపట్టేవాని కాలుమీదికి ఎక్కి తొడవరకు పాకింది. వానితొడను గట్టిగా కుట్టింది.

చీమ కుట్టడంతో పిట్టలు పట్టేవాడు 'అబ్బా' అని కదిలాడు. వాడి చేతిలోవున్న వెదురుకర్ర పక్కకు కదిలింది.





చెట్టుమీది ఆకులు గలగలమన్నాయి. ఆ చప్పుడుకి పావురం రివ్వున పైకి ఎగిరిపోయింది.

కష్టాల్లో వున్నవాళ్లకు మనం సాయం చెయ్యాలి. అప్పుడు మనకు కూడా కష్టాలు వచ్చినప్పుడు దేవుడు ఏవిధంగానో తోడ్పడతాడు.

నీతి: ఇరుగుపొరుగుకు సాయం చేస్తే దేవుడు కరుణిస్తాడు.

--*--

# 22. అతిథి సత్కారం

ఇది పురాణంలోని ఓ కథ. అడవిలో పిట్టలు పట్టి, వాటిని అమ్మి పొట్టపోసుకోనే ఓ మనిషి వుండేవాడు. అతను వెదురుకర్రకు బంకపూసి, చెట్లమీదున్న పిట్టలను పట్టేవాడు. చలికాలంలో ఓ రోజున అతను పిట్టలు పట్టడానికి అడవికి వెళ్లాడు. ఓ పక్షికూడా దొరకలేదు. పాపం అతను అడవి అంతా గాలించాడు. పొద్దు గుంకింది. అడవిలో చాలా దూరం వచ్చినందువల్ల అతను ఆపూట అక్కడే వుండిపోవాల్సి వచ్చింది. చీకటి పడింది. ఆ రాత్రి ఓ చెట్టుకింద గడపాలనుకొన్నాడు.

ఆరోజు వడగళ్లవాన కురిసింది. చలి గడగడ వణికిస్తూవుంది. పిట్టలు పట్టేవాడి దగ్గర కప్పుకోవడానికి ఎలాంటి బట్టలు లేవు. రాత్రి అడవిలో వుండాల్సి వస్తుందని అతనేమైనా కలగన్నాడా? గాలి రివ్వు రివ్వుమంటూ వీస్తూంది. అతను చలికి గడగడ వణుకుతున్నాడు, పాపం!

అతను ఓ చెట్టు క్రింద కూర్చున్నాడుగా! ఆ చెట్టుమీద ఓ పావురాల జంట గూడుకట్టుకొని కాపురం చేస్తూ వుంది. పిట్టలుపట్టేవాని దురవస్థచూసి మగపావురం ఆడపావురంతో ఇలా అంది -"ఈ మనిషి మనకు శత్రువు. నిజమేకాని, ఈ రోజు మనకు అతను అతిథిగా వచ్చాడు. అతిథి దేవునితో సమానం. అతన్ని ఆదరించటం మనకర్తవ్యం. చలి మరింత ఎక్కువవుతుంది. అతను రాత్రంతా ఇలానే వుంటే చలిబాధకు తట్టుకోలేక చనిపోవడం ఖాయం. అతను చనిపోతే ఆపాపం మనకు అంటుకుంటుంది. మనం ఇప్పుడు అతన్ని చలినుంచి కాపాడాలి.'



పావురాలు తాము కష్టపడికట్టుకొన్న గూటిని క్రిందికి పడవేశాయి. చిన్న చిన్న కట్టెపుల్లల్ని తమ ముక్కులతో కరచికొని తెచ్చి క్రిందికి పడవేశాయి. కొంచెం సేపయిన తర్వాత ఆడపావురం ఎగిరిపోయి, ఎక్కడినుంచో మండుతున్న ఓ చిన్న కొరివిని తెచ్చి, ఆ కట్టెపుల్లలమీద పడవేసింది. కట్టెపుల్లలు అంటుకొని మండసాగాయి. పిట్టలు పట్టేవాడు మరిన్నిపుల్లలు, ఎండుటాకుల్ని పోగుచేసి మంటలో వేశాడు. అతను చలినుంచి బయటపడ్డాడు.

పిట్టలుపట్టేవాడికి బాగా ఆకలివేసింది. అతను మంటవెలుగులో ఏమైనా తినడానికి దొరుకుతుందేమో అని అటూ ఇటూ చూశాడు. అతను ఆకలితో అల్లాడిపోతున్నాడు. ఇదంతా చూసిన ఆడపావురం మగపావురంతో ఇలా అంది-'అతిథి సాక్షాత్తు భగవంతుని స్వరూపుడు. ఇంటికి వచ్చిన అతిథుల ఆకలిదప్పులు తీర్చకపోతే వాళ్లకు పాపం వస్తుంది. ఇతను ఈ రోజు మన అతిథి. పాపం, ఆకలితో బాధపడుతున్నాడు. ఇతని ఆకలి తీర్చటానికి మనవద్ద ఏముంది? నేను మండుతున్న నిప్పుల్లో దూకుతాను. అప్పుడు అతను నా మాంసం తిని తన ఆకలి తీర్చుకొంటాడు'.

ఈ మాటలు అన్న తర్వాత ఆడపావురం చెట్టుమీదినుంచి గభాలున నిప్పుల్లో దూకింది. అప్పుడు మగపావురం తనలోతాను ఇలా అనుకొంది. 'ఈ కొద్దిపాటి మాంసంతో ఈ అతిథి ఆకలి తీరుతుందా? నేను కూడా మంటలో పడి, నా మాంసాన్ని ఇతనికి ఇస్తాను' మరుక్షణమే మగపావురం మంటలోకి దూకింది.



ఆకాశంలో దుందుభులు మోగాయి. పూలవాన కురిసింది. దేవవిమానం పైనుంచి క్రిందికి దిగింది. రెండు పావురాలు దేవతల వేషాల్లో దివ్యలోకాలకు వెళ్లిపొయ్యారు. గొప్ప గొప్ప యజ్ఞయాగాదులు చేసే చక్రవర్తులకు, కఠోరతపస్సు చేసే మహర్షులకు కాని ఆ భాగ్యం కలుగదు!

నీతి : అతిథిసేవ స్వర్గానికి త్రోవ.

~~*~~



# 23. సహవాసఫలం

ఓ రైతు పొలం అడవికి సమీపంగా వుండేది. ఆ అరణ్యంలో చాలా పక్షులుండేవి. రైతు పొలంలో విత్తనాలు విత్తి ఇంటికి వెళ్ళగానే పక్షులు గుంపులు గుంపులుగా పొలంమీద వాలేవి. మట్టిని పెళ్లగించి, లోపల వున్న ధాన్యాన్ని తీసేవి. పాపం, రైతు పిట్టలను తోలి తోలి విసుగు చెందాడు. అతను నాటిన విత్తనాలను పక్షులు తినేయడంతో, మళ్లీ పొలం దున్ని, విత్తనాలు విత్తవలసి వచ్చేది. పిట్టల బెడదతో రైతు బాగా విసిగిపొయ్యాడు.

ఒకసారి రైతు ఓ పెద్ద వలతెచ్చి, పొలంమీద పరచాడు. పిట్టలు గుంపులు గుంపులుగా పొలంమీద వాలాయి. వలలో చిక్కుకొని పొయ్యాయి. పాపం, వాటితో పాటు ఓసారసపక్షి కూడా వలలో చిక్కుకొని పోయింది.

రైతు వలలో తగుల్కొన్న పక్షులను ఒక్కటొక్కటిగా పట్టుకోసాగాడు. అప్పుడు ఆ సారసపక్షి దీనంగా అతన్ని ఇలా వేడుకొంది-'అయ్యా, నన్ను కరుణించండి. నేను మీకు ఎలాంటి హాని తలపెట్టలేదు. నేను కోడినీ కాను, కొంగనూ కాను. విత్తనాలు తినే పక్షిని అసలే కాను. నేను సారసపక్షిని. పంటలకు కీడు చేసే పురుగులను తినే పక్షిని. నన్ను వదిలి వెయ్యండి'.

రైతు అసలే కోపంగా వున్నాడు. పెట్రేగిపోతూ ఇలా అన్నాడు -'నీమాట నిజమే కావొచ్చు. కాని నా పొలంలోని విత్తనాలను తినేసే పక్షులతో పాటు నీవు కూడా పట్టుబడ్డావు. నీవూ వాళ్ళ స్నేహితుడివే. వీళ్లకు కలిగే శాస్తి నీకూ కలగాలి. తప్పదు మరి'.



నీవు ఎలాంటివాళ్ల స్నేహం చేస్తావో, నీకూ అలాంటి పేరే వస్తుంది. చెడ్డవాళ్లతో కలిసి తిరిగితే, చెడ్డపనులు చేయకున్నా నీకు చెడ్డపేరు వస్తుంది. తగిన శిక్షకూడా పడుతుంది. చెరుపు చేసే పక్షులతో చేరినందువల్ల సారసపక్షి కూడా వలలో చిక్కుకోవలసి వచ్చింది.

నీతి: చెడ్డవాళ్లస్నేహం చెయ్యకూడదు.

~~*~~



# 24. పక్షినేర్పిన పాఠం

ఓ వూరి దగ్గరి పొలంలో సారసపక్షుల జంట నివసిస్తూ వుండేది. ఆడ సారసపక్షి గుడ్లు పెట్టింది. కొంత కాలానికి గుడ్లలోనుంచి పిల్లలు బయటికి వచ్చాయి. వాటికి రెక్కలు వచ్చి, అవి ఎగరటానికి ముందే పంటకోతకు వచ్చింది. సారస పక్షులకు దిగులు చుట్టుకొనింది. రైతు పంటను కోయటానికి ముందే, పిల్లలతో పాటు మరో సురక్షితమైన చోటుకి ఎగిరివెళ్లాలి. కాని పిల్లలు ఎగరలేవే? అప్పుడు సారసపక్షి పిల్లలతో ఇలా అంది - 'మేం లేనప్పుడు ఎవరైనా పొలం వద్ద ఏమైనా మాట్లాడుకొంటే విని మాకు చెప్పండి.'

ఓ రోజు సారసపక్షి మేత తీసుకొని సాయంకాలం గూడు చేరుకొంది. అప్పుడు పిల్లలు ఇలా అన్నాయి - 'ఈ రోజు రైతు వచ్చాడు. పొలం చుట్టూ తిరిగాడు. ఒకటి, రెండు, చోట్ల నిలబడి పొలంవైపు చాలాసేపు చూసాడు. చేను కోతకు వచ్చింది. ఇక కొయ్యాల్సిందే. ఈ రోజే వెళ్లి వూళ్లోని వాళ్లతో నా చేను కోయమని చెప్తాను.'

'మీరేమీ భయపడకండి. రైతు ఇప్పుడిప్పుడే చేను కొయ్యడు. ఇంకా కొన్ని రోజులు మనం ఇక్కడే హాయిగా వుండొచ్చు'. - అని పక్షి పిల్లలతో చెప్పింది.

కొద్దిరోజులు గడిచాయి. ఓ రోజు సారసపక్షి సాయంకాలం గూడు చేరుకొంది. అప్పుడు పిల్లలు బితుకు బితుకుమంటూ ఇలా చెప్పాయి - మనం వెంటనే ఈ చేను వదిలివెళ్లాలి. ఈ రోజు రైతు మళ్లీ వచ్చాడు. ఊళ్లోని రైతులు చాలా స్వార్థపరులు. నా చేను కొయ్యటానికి ఇంతవరకు రాలేదు. నేను నా

అన్నతమ్ముల్ని పిలిపించి వాళ్లతో పంట కోయిస్తాను.'

సారసపక్షి హాయిగా, నిశ్చింతగా కూర్చొని పిల్లలతో ఇలా చెప్పింది - 'ఇప్పుడిప్పుడే రైతు పంట కోయించడు. నాలుగైదు రోజుల్లో మీరు ఎంచక్కా ఎగరగలరు. ఇప్పుడిప్పుడే మనం పొలం విడిచి మరో చోటికి పోనక్కర్లేదు.'



ఇలా మరి కొన్ని రోజులు గడిచి పోయ్యాయి. సారసపక్షి పిల్లలు బాగా ఎగరసాగాయి. వాటికి భయం లేకుండా పోయింది. ఓ సాయంకాలం అవి సారసపక్షితో ఇలా అన్నాయి - 'ఈ రైతు మమ్మల్ని ఉత్తుత్తినే భయపెడ్తున్నాడు. ఇతడు పైరు కోసినట్లే. ఈ రోజు కూడా వచ్చాడు. అన్నాడు కదా - 'నా



అన్నతమ్ములు నా మాట వినడం లేదు. ఏదో ఓ నెపంతో తప్పించుకొంటున్నారు. పైరు బాగా ఎండిపోయి గింజలు నేల రాలిపోతున్నాయి. రేపు పొద్దు పొడవగానే నేనే వచ్చి కోత మొదలెడ్తాను.'

అప్పుడు సారసపక్షి భయపడింది. -'అరరే! వెంటనే బయలు దేరండి. ఇంకా చీకటి పడలేదు. మరో చోటికి వెళ్లి తలదాచుకొందాం. రైతు రేపు తప్పకుండా పంట కోస్తాడు.' అని అంది.

పిల్లలు ఆదుర్దాగా అడిగారు- 'ఎందుకు వెళ్లాలి? రైతు రేపు పంట కోస్తాడన్న నమ్మకం ఏంటి?'

సారసపక్షి ఇలా బదులు చెప్పింది -'రైతు గ్రామస్తులను, సోదరులను నమ్ముకొన్నంత కాలం పంట కోస్తాడన్న నమ్మకం కలుగలేదు. తనపని తాను చేయకుండా, ఇతరులు చేసి పెడ్తారని అనుకున్నంత కాలం ఎవరి పనులు జరగవు. కాని ఎవరంతకు వారు, తమ పనులు చేసుకోవాలని నిర్ణయించుకొన్నప్పుడు, అవి చకచకా సాగిపోతాయి. రైతు తానే రేపు పంట కోస్తానని అన్నప్పుడు, ఆపని తప్పకుండా జరిగితీరుతుంది.'

సారసపక్షులు పిల్లలతో ఆ క్షణమే మరో సురక్షితమైన చోటికి ఎగిరిపోయ్యాయి.

నీతి: సొంతకాళ్లమీద నిలబడితేనే పనులు సజావుగా సాగుతాయి.

--*--

# 25. ప్రత్యుపకారం

ఓసారి ఓ సింహం కాలికి పెద్దముల్లు గుచ్చుకొంది. సింహం పళ్లతో కాలికి పైకి తియ్యాలని ఎంత ప్రయత్నించినా ముల్లు బయటికిరాలేదు. అది కుంటుతూ కుంటుతూ ఓ గొర్రెల కాపరి వద్దకు వెళ్లింది. సింహం తన వైపు వస్తూండటం చూసి గొర్రెలకాపరి భయంతో గడగడా వణకసాగాడు. పారిపోయినా సింహం బారినుండి తప్పించుకోలేనని అతనికి అర్థం అయింది. ఏదైనా చెట్టు ఎక్కిప్రాణాలు రక్షించుకొందామని అనుకున్నాడు. కాని దగ్గర ఒక్క చెట్టు కూడా కనపడలేదు. మరో దారి లేక అతను కూర్చొన్న చోటే బిక్కుబిక్కుమంటూ వుండిపోయ్యాడు.

సింహం గర్జించనూలేదు, గుర్రుమననూలేదు. మెల్లగా గొర్రెల కాపరివద్దకు వచ్చి, అతని ఎదుట కూర్చొంది. ముల్లు





గుచ్చుకున్న తన కాలును అతని ముందుకు చాచింది. సింహం తన సాయం కోరి వచ్చిందని గొర్రెల కాపరి తెలుసుకున్నాడు. అతను దానికాలిలోని ముల్లును తీశాడు. సింహం వచ్చిన దారినే చక్కా పోయింది.

కొన్ని రోజుల తర్వాత రాజభవనంలో దొంగతనం జరిగింది. గొర్రెల కాపరి అంటే గిట్టనివాళ్లు కొందరు అతనే దొంగతనం చేశాడని రాజుతో చాడీ చెప్పారు. భటులు గొర్రెల కాపరిని బంధించారు. కాని దొంగిలించబడిన వస్తువులు ఏవీ అతని ఇంట్లో దొరకలేదు. అతను ఆ వస్తువులను మరెక్కడైనా దాచాడేమో అని రాజు భావించాడు. రాజు గొర్రెలకాపరిని సింహానికి ఆహారంగా పంపాడు.

గొర్రెల కాపరి భయంతో వణికిపోతున్నాడు. కొద్ది నిముషాల్లో అతను సింహానికి ఆహారం కాబోతున్నాడు. కాని ఓ విచిత్రం జరిగింది. ఆ సింహం ఒకప్పుడు అతనిచే కాలిముల్లు తీయించుకొన్నదే! అది తనకు మేలు చేసిన మనిషిని గుర్తు పట్టింది. అది అతని ఎదుట వచ్చి, చుట్టూ తిరుగుతూ తోక అల్లాడిస్తూ అతని ప్రక్కన కూర్చుండిపోయింది.

రాజుకు ఆశ్చర్యం కలిగింది. రాజు గొర్రెల కాపరిని అడిగి, జరిగిన కథ అంతా తెలుసుకొన్నాడు. రాజు అతన్ని విడిచిపెట్టాడు..

సింహం లాంటి భయంకర జంతువు కూడా తనకు మేలు చేసిన వ్యక్తిని మరచిపోలేదు. చేసిన మేలు మరిచిపొయ్యే మనుష్యులు, పశువుల కంటే హీనం.

నీతి: ఎవరూ చేసినమేలు మరువరాదు.

~~*~~

# 26. మోసపు గాడిద

అనగనగా ఓ గాడిద. అది అడవిలో మేస్తూ వుండేది. అది చాలా కపటమైనది. ఓ సారి దానికి సింహం చర్మం దొరికింది. గాడిద దాన్ని వొంటినిండా కప్పుకొని సింహంలా తయారయింది. కనపడిన వాళ్లందర్నీ భయపెడుతూ, వాళ్ల ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని పరుగెత్తుతూ వుంటే బాగా ఆనందించేది.

సింహం తోలు కప్పుకొన్న గాడిద పైర్లు మేస్తూ హాయిగా కాలం గడిపేది. రైతులు సింహానికి జడిసి బితుకు బితుకుమంటూ బతుకు తుండేవారు. గాడిద తన్ను 'మృగరాజు' గా ప్రకటించుకొనింది. అది బాగి బలిసిపోయింది.

అడవి జంతువులను చూసి కన్నెర్రచేసేది. అవి దాని దెబ్బకు తారెత్తిపొయ్యేవి.

పున్నమివెన్నెల. గాడిద ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పొలం వెళ్లి తృప్తిగా మేయసాగింది. పంట కాపులు సింహాన్ని చూసి తలో దిక్కు దౌడు తీశారు.

ఇంతలో ఎక్కడనుంచో గాడిద అరపు వినిపించింది. ఇంకేం, మన గాడిద చెవులు రిక్కబొడుచుకొన్నాయి. అది ఆనందంతో తలపైకెత్తి ఓండ్రపెట్ట సాగింది. సింహం గుట్టు రట్టయింది.





పంటకాపులు కర్రలెత్తుకొని గాడిదను తరిమి తరిమి కొట్టారు. ఇతరుల్ని మోసగించేవారు, ఏదో ఒకరోజున పట్టుపడక తప్పదు.

**నీతి: మోసగించేవారు గోతిలో పడకతప్పదు.**

---*---

## 27. అత్యాశ గతిచేటు

ఓ వూళ్లో ఓ కోతి వుండేది. అది ఓయింటికి ప్రతిదినమూ వెళ్లి నానా హంగామా చేస్తూ వుండేది. ఓ రోజు బట్టలు చింపేసేది. మరోరోజు పాత్రల్ని ఎత్తుకెళ్లేది. ఇంకో రోజు పిల్లల్ని కొరికేది. కోతి తినుబండారాల్ని ఎత్తుకెళ్తే ఇంటివాళ్లు బాధపడేవారు కారు. కాని అది రోజూ చేసే ఆగడాల్ని భరించ లేకపొయ్యారు.

ఇంటి యజమాని ఇక సహించలేకపొయ్యాడు. ఎలాగైనా సరే, దీన్ని పట్టి బయటికి పంపించాలని నిశ్చయించుకొన్నాడు. చిన్ని మూతిగల ఓ పాత్రలో వేయించిన సెనగలు వేసి, ఆ పాత్రను గది మధ్య భూమిలో పాతిపెట్టాడు. పాత్ర మూతి మాత్రం బయటికి కనపడుతూ వుంది. ఇంటిల్లిపాదీ తలుపులు తెరిచి బయటికి వెళ్లిపొయ్యారు.

కోతి ఇంట్లో దూరింది. కాస్సేపు అటూ ఇటూ గెంతులు వేసింది. పాతిపెట్టిన పాత్రలోని సెనగల్ని చూసింది. తినాలని ఆశపడింది. దాని దగ్గరకు వెళ్లి కూర్చొంది. సెనగల్ని తీసుకోవాలని చెయ్యి పాత్రలోనికి పోనిచ్చి, చేతినిండా సెనగల్ని తీసుకొంది. పాత్ర మూతి చిన్నగా వున్నందువల్ల చెయ్యి



బయటికి రాలేదు. కోతి చేతిని బయటికితీసుకోవాలని గింజుకుంది. గీపెట్టింది. గంతులేసింది. కాని ఆశకొద్దీ సెనగలు పట్టుకొన్న పిడికిలిని వదలలేక పొయ్యింది.



ఇంటియజమాని లోపలికి వచ్చాడు. కోతిని తాళ్లతో కట్టివేశాడు. ఎవరికో అప్పగించి దూరంగా పంపివేశాడు. సెనగల మీది ఆశతో కోతి చిక్కుకు పొయ్యింది.

*నీతి: అత్యాశ గతిచేటు*

—*—

# 28. ఆశపోతు కుక్క

ఓ కుక్క రొట్టెముక్క నోటితో కరుచుకొని పోతూవుంది. దారిలో ఓవాగు అడ్డం వచ్చింది. నీళ్ల లోతుగా లేనందువల్ల కుక్క జాగ్రత్తగా వాగు దాటసాగింది. కుక్కకు నీటిలో తన ప్రతిబింబం కనపడింది.



కుక్క తనలో తాను ఇలా అనుకొనింది -"నీళ్లలో మరో కుక్క రొట్టె ముక్క తీసుకొని పోతూవుంది. నేను దాన్ని కాస్తా లాక్కుంటే, పెద్దరొట్టెను ఎంచక్కా తినొచ్చు."

నీళ్లలో కనపడే కుక్కనోట్లోనుంచి రొట్టెముక్కలాక్కోవాలని కుక్క నోరు తెరిచింది. అప్పుడు దాని నోట్లో వున్న రొట్టెముక్క కాస్తా నీళ్లలో పడి కొట్టుకు పోయింది. కుక్క తెల్లమొగం వేసింది.

నీతి: దురాశపడితే వున్నది కూడా పోతుంది.

~~*~~



# 29. పోరునష్టం పొందులాభం

ఓ పల్లెలో రెండు పిల్లులు వుండేవి. అవి ఎంతో అన్యోన్యంగా జీవిస్తూ వుండేవి. ఏది దొరికినా, రెండూ సమానంగా పంచుకొని తింటూ వుండేవి. ఓ రోజు వాటికి ఓ రొట్టె దొరికింది. దాన్ని చెరిసగం పంచుకోవడంలో రెంటి మధ్య పేచీ వచ్చింది. 'నీ రొట్టె ముక్క పెద్దదిగా వుంది అని ఓ పిల్లి అంటే, కాదు నీరొట్టె ముక్కే పెద్దది' అని మరో పిల్లి, రెండూ వాదులాడుకోవడం మొదలెట్టాయి.

రొట్టెను సమానంగా పంచుకొనే తగాదా ఎంతసేపటికీ తెగలేదు. న్యాయం కోసమై రెండు పిల్లులు ఓ కోతివద్దకు వెళ్లాయి. అవి కోతిని పెద్దమనిషిగా ఎన్నుకొన్నాయి. కోతి త్రాసు తెచ్చింది. రెండు రొట్టెముక్కల్ని త్రాసులో చెరోవైపు వేసింది.



త్రాసు ముల్లు ఓ వైపు మొగ్గింది. అప్పుడు కోతి ఆ వైపున్న రొట్టెముక్కను కాస్త తుంచి నోట్లో వేసుకొంది. ఇప్పుడు త్రాసుముల్లు రెండోవైపు మొగ్గింది. కోతి ఈ వైపున్న రొట్టెముక్క కాస్త తుంచి నోట్లో వేసుకొంది. కోతి రెండు రొట్టెముక్కల్ని ఓసారి అలా, మరోసారి ఇలా తుంచి తినసాగింది.

ఇలా కోతి రొట్టెముక్కల్ని మళ్లీమళ్లీ తినేసరికి, ఆముక్కలు రెండూ మరింత చిన్నవై పొయ్యాయి. ఇది చూసి రెండుపిల్లులు గాభరా చెందాయి. "అయ్యా, మీరు చేస్తున్న న్యాయం చాలు. ఆ రొట్టె ముక్కల్ని మేమే పంచుకొంటాం మీకో దండం." అని పిల్లులు కోతితో అన్నాయి.

అప్పుడు కోతి ఇలాచెప్పింది - "మరి మీకు న్యాయం చెప్పేందుకని నేను కష్టపడ్డాను కదా! నా ప్రతిఫలం మాటేమిటి?" అంటూ మిగిలిన ఆ రొట్టె ముక్కల్ని గబాలున నోట్లో వేసుకొని మింగివేసింది. తర్వాత గుర్-గుర్-... గుర్ అంటూ పిల్లుల్ని భయపెట్టి తరిమివేసింది.

తమ అమాయకత్వానికి పిల్లులు బాధపడ్డాయి. మూర్ఖత్వానికి సిగ్గుపడ్డాయి.

నీతి: పోరు నష్టం పొందు లాభం.

~~*~~



# 30. కలిసి వుంటే కలదు సుఖం

ఓ అడవిలో ఓ సింహం, ఓ చిరత పులి వుండేవి. సింహమేమో బలిష్టమైనదే. కాని వయస్సు మళ్లిన కారణంగా సరిగ్గా పరుగెత్త లేకపోయేది. వేటాడలేక పోయేది. చిరతపులి బాగాబలంగా వుండేది. అయినా అది సింహమంటే భయపడేది. ఎంతయినా అది మృగరాజు కదా? అది సింహంతో స్నేహం చేసేది. ఎందుకంటే, ఎంత చెడ్డా ముసలి సింహం చిరతకంటే బలిష్టంగానే వుండేది.

ఓ మారు ఏంజరిగిందంటే-ఎన్నో రోజులు గడిచినా రెంటికీ ఆహారం దొరకలేదు. రెండూ ఆకలితో నకనక లాడుతున్నాయి. దగ్గరలో ఆకులు అలములు మేస్తూ వున్న ఓ జింకపిల్లను అవి చూశాయి. "నేను జింకపిల్లను వాడిసి పట్టేస్తాను. మీరు దూరంగా వుండి, అది పారిపోకుండా చూడండి." అని చిరత సింహంతో చెప్పింది.

సింహం దూరంగా వుండి పోయింది. చిరుతపులి వురికి జింకపిల్లను గబుక్కున కొరికి చంపివేసింది. జింకపిల్ల మరీచిన్నదిగా వుండటంతో అది ఒక్కరికే మాత్రమే సరిపొయ్యేలా వుంది. కాని సింహం, చిరతపులి రెండూ ఆకలిగా వున్నాయి. రెంటి నోళ్లలోనూ నీరువూరుతున్నాయి. "జింకపిల్లను నేను చంపాను కాబట్టే దీన్ని నేనే తింటాను." అంది చిరత.

"నేను మృగరాజును తెలుసా! కనుక నేనే జింకపిల్లను తింటాను. ఎలాగూ నీవు బాగా పరుగెత్తగలవు. కనుక ఇంకో జంతువును వేటాడి తిను." గర్జించి చెప్పింది సింహం.

ఇద్దరి మధ్యా మాటామాటా పెరిగింది. గర్జిస్తూ, పంజాలు విప్పి, కోరలు చాచి రెండూ పోట్లాడ సాగాయి. పొదల చాటున



దాగివున్న ఓ నక్క ఈ దృశ్యమంతా చూస్తూవుంది. సింహం, చిరత బాగా పోట్లాడి, గాయాలతో నిండి, అలిసి సొలిసి పొయ్యాయి. అదను చూసి నక్క పొదలోనుంచి వచ్చి జింకపిల్లను లాక్కొని పోయింది. లొట్టలు వేసుకొంటూ తినసాగింది. పాపం! సింహం కాని, చిరత కాని పైకి లేవలేక అలానే చూస్తూ వుండిపొయ్యాయి.

ఇద్దరు వ్యక్తులు దేనికోసమో తమలో తాము కొట్లాడుతారనుకోండి ఇద్దరూ నష్టపోతారు. ఎవరో మూడో మనిషికి లాభం కలుగుతుంది. బాలలూ! మరిమీరు పరస్పరం కొట్లాడుకోరు కదూ! కొంత నష్టపోయినా సరే, కలిసివుంటే కలదు సుఖం.

నీతి: కలిసి వుంటే కలదు సుఖం

~~*~~



# 31. అబద్ధాలాడితే వచ్చే కీడు

ఓ వూళ్లో గొర్రెలు కాసే ఓ కుర్రాడు వుండేవాడు. అతడు అబద్ధాల పుట్ట. అతడు గొర్రెలను తోలుకొని మేపడానికై అడవికి వెళ్లేవాడు.

గొర్రెలు మేత మేస్తూవుంటే "అయ్యో, కాపాడండి! కాపాడండి! తోడేలు వచ్చి నా గొర్రెను ఎత్తు కెళ్లింది. ఓరి నాయనోయ్!" అంటూ వుత్తిత్తిగా శోకాలు పొయ్యేవాడు. చుట్టు ప్రక్కల వున్న పసుల కాపర్లు గాభరాగా పరుగెత్తుకొస్తే, వాళ్లను చూసి పకపకా నవ్వేవాడు. పాపం! వాళ్ల ముఖాలు చిన్నబుచ్చికొని తమనుతాము తిట్టుకొంటూ తిరిగి వెళ్లేవాళ్లు.

ఓ రోజు నిజంగా తోడేలు వచ్చింది. అది గొర్రెల మందపై పడింది. ఆ కుర్రాడు భయంతో "రక్షించండి! రక్షించండి! తోడేలు వచ్చింది. నా గొర్రెను ఎత్తుకు పోతూంది" అంటూ బిగ్గరగా అరవసాగాడు.

కాని ఆ కుర్రాడు వొట్టే అబద్ధాలు చెప్పుతున్నాడనీ, తమను ఆటపట్టించడానికే అలా అరుస్తున్నాడనుకొనీ ఎవరూ సాయానికి రాలేదు.



తోడేలు గొర్రెల మందపై పడి ఓ గొర్రెను ఎత్తుకొని పోయింది. పాపం! ఆ కుర్రాడు తలపట్టుకు కూర్చొన్నాడు.

పిల్లలూ! మీరు ఎప్పుడూ అబద్ధాలు చెప్పకండి. అలా చెప్పారో జాగ్రత్త! మిమ్మల్ని ఎవరూ మంచివారని అనరు. మీమాటల్ని ఎవరూ నమ్మరు. సరికదా! మీరు జీవితంలో నష్టపడతారు.

నీతి: అబద్ధాలాడితే అసలుకు మోసం వస్తుంది.

~~*~~



# 32. తాబేలు-కుందేలు

మీరు కుందేళ్లను చూసేవుంటారు. తెల్లగానూ, గోధుమరంగులోనూ వుంటాయి. ఇంకా ఎన్నో రంగురంగుల కుందేళ్లు కూడా వుంటాయి. కొంత మంది కుందేళ్లను పెంచుకొంటారు. కుందేలును సంస్కృతంలో శశక అని అంటారు. కుందేలు చూడటానికి చిన్నగా వున్నా, చాలా వేగంగా పరుగెత్తుతుంది.

ఓ మారు ఓ కుందేలు వాగడం మొదలెట్టింది - "నేను బాగా గెంతగలను. ఈ ప్రపంచంలో నాతో సమానంగా పరుగెత్త గలవారు ఎవ్వరూ లేరు."

అక్కడే వున్న ఓ తాబేలు దాని మాటలు విని ఇలా అంది- "అన్నా! నీవు చాలా వేగంగా పరుగెత్తే మాట నిజమే. కాని అంతగర్వం పనికిరాదు. పొగరుపడితే అవమానం పాలు కావలసి వస్తుంది."

కుందేలు పొగరు మొత్తనంతో ఇలా బదులిచ్చింది -"నేనేం వూరకే గొప్పలు చెప్పుకోవడం లేదు. ఉన్నమాట వున్నట్లంటే నీకు ఉలుకెందుకు? నీవు మెల్లమెల్లగా పురుగులాగా పాకుతూ వుంటావు. అందుకే నా గొప్పతనం వింటే నీకు కడుపు మంట."

కుందేలు తాబేలును చీటికి మాటికి ఎగతాళి చేయసాగింది. తాబేలు కాని ఎన్నాళ్లని సహించగలుగుతుంది? ఓ రోజు తాబేలు కుందేలుతో ఇలా చెప్పింది - మీరు చాలా వేగంగా పరిగెత్తగలరని వాకటే గొప్పలు చెప్పుకొంటున్నారు. సరే, పందెం కాద్దాం. మనిద్దరిలో ఎవరు వేగంగా పరుగెత్తుతారో? ఎవరు గెలుస్తారో చూద్దాం."

కుందేలు దూరంగా వున్న ఓచెట్టును చూపించి తాబేలుతో ఇలా చెప్పింది - "అలాగే కానివ్వండి. ఆ చెట్టు వద్దకు ఎవరు ముందుగా వెళ్తారో, వాళ్లే పందెం గెలిచినట్లు. సరేనా?"

"పాపం! తాబేలు నిదానంగా దేకుతుంది. అది చెట్టుకు కాసింత దూరంలో వుండగానే, మొదలు పెట్టినా నేను నాలుగు గెంతులు గెంతితే చాలు, దాన్ని దాటి పోగలను" అని భావించింది కుందేలు. అందుకని ధీమాగా తాబేలుతో ఇలాఅంది. "నీవు వొట్టి సోమరివి. మెలమెల్లగా నడుస్తావు. నీవు నడు. నేను కాస్సేపాగి వస్తాను."





"పరుగుపందెం ఈ క్షణమే మొదలయినట్లు తెలిసిందా? నీ ఇష్టం వచ్చినప్పుడు రా నాకేం?" తాబేలు చెప్పింది.

కుందేలు తాబేలు మాటలకు తలవూపింది. తాబేలు మెల్లమెల్లగా నడవడం మొదలెట్టింది. "ఇది చెట్టు వద్దకు వెళ్లడమంటే తెల్లవారినట్లే. అందాకా ఓ చిన్న కునుకు తీస్తా" అనుకొంది కుందేలు. అది అక్కడే పండుకొని ఓకునుకు తీసింది. మెలకువ వచ్చేసరికి తాను ఎంతసేపు నిద్రపోయిందో తెలిసింది కాదు. వెంటనే నిద్రలేచి గబగబా గెంతుతూ చెట్టువద్దకు వెళ్లింది. కాని తనకంటే ముందే అక్కడ తాబేలు వుండటం గమనించింది. కుందేలు సిగ్గుతో తలొంచుకొంది. గర్వం పనికిరాదన్న సత్యం తెలుసుకొంది.

గర్విస్తే అవమానం పాలుకాక తప్పదు. గర్వపడేవాళ్ళు రేపోమాపో పని చేద్దామనుకొనే సోమరులు జీవితంలో నెగ్గుకు రాలేరు. ధైర్యంగా, ఆత్మవిశ్వాసంతో పని చేసేవాళ్లు తప్పక విజయం సాధిస్తారు. పదిమంది చేతా శెభాష్ అనిపించుకొంటారు.

నీతి: *గర్వం పతనానికి దారి తీస్తుంది.*

---*---

## 33. కుక్క చేసిన పొరపాటు

ఓ కుక్కకు పక్షుల గుడ్లు తినే అలవాటు వుండేది. అది పొలంగట్ల మీద, నదీతీరాల్లో తిరుగుతూ తీతువు పిట్టల గుడ్లు కనపడితే చాలు గబుక్కున తినేసేది. నదుల గట్లమీద ఇసుకలో తాబేళ్ల గుడ్ల కోసం వెతుకుతూ వుండేది.

ఓ రోజు కుక్క నదిగట్టుమీద ఓ నత్తగుల్లను చూసింది. దాన్ని ఏదో ఓ గుడ్డు అనుకొని గబుక్కున మింగేసింది. కుక్కపొట్టలోకి వెళ్లిన నత్తగుల్ల ముక్కలు పేగుల్లోకి చొచ్చుకొనిపోయి బాధించసాగాయి. కుక్క బాధతో విలవిల లాడసాగింది. "గుండ్రని వస్తువులన్నీ గుడ్లనుకొన్నాను. నేను పొరపడ్డాను. నాకు ఇప్పుడు బుద్ధి వచ్చింది." - కుక్క ఏడుస్తూ చెప్పింది.





కంటికి కనపడ్డ వస్తువుల్ని ముందూ వెనకా చూడకుండా తింటే, ఇలాగే తిప్పలు పడాల్సివస్తుంది. తినదగిన వస్తువని తెలుసుకొన్న తర్వాతే తినాలి. తెలుసుకోకుండా తింటే కష్టాలు తప్పవు.

నీతి : ఆలోచించకుండా ఏపనీ చేయరాదు.

# 34. జింకల నిజాయితీ

ఓ అడవిలో ఓ చెరువు వుండేది. అడవి జంతువులు నీళ్ళు త్రాగడానికని ఆ చెరువు వద్దకు వచ్చేవి. ఓ రోజు ఓ వేటకాడు ఆ చెరువు వద్దకు వచ్చాడు. అతడు చెరువులో ముఖం కడుక్కొని నీళ్ళు త్రాగాడు. అతడు బాగా అలిసి పోయివున్నాడు. పైగా చాలా రోజులనుంచి ఆకలితో అలమటిస్తున్నాడు. "అడవి జంతువులు నీళ్ళు త్రాగడానికని తప్పకుండా ఈ చెరువు వద్దకు వస్తాయి. ఒకటో రెండో జంతువుల్ని చంపి హాయిగా నా కడుపు నింపు కొనవచ్చు" అని తలచాడు. చెరువుకు సమీపంగా వున్న ఓ చెట్టు ఎక్కి కొమ్మల చాటున నక్కి కూర్చొన్నాడు.

ఇంతలో ఓ జింక నీళ్ళు త్రాగడానికని అక్కడికి వచ్చింది. వేటకాడు జింకను చంపాలని విల్లుపై బాణం ఎక్కుపెట్టాడు. జింక తన్ను చంపాలని ప్రయత్నిస్తున్న వేటకాడిని చూసింది- "అన్నా! వేటకాడా! నేను నీగురినుంచి తప్పించుకొని ప్రాణాలతోబయటపడలేను; నన్న కనికరించి వదిలెయ్యి, నాకోసం నా ఇద్దరు చిన్న పిల్లలు వేయికళ్లతో ఎదురు చూస్తుంటారు. నీవు నన్ను కొంచెం సేపు వదిలెయ్యి. నేను నా పిల్లలకు పాలిచ్చి, వాళ్లను నా స్నేహితురాలికి అప్పగించి మీవద్దకు తిరిగి వస్తాను." జింక వేటకాడిని దీనంగా వేడుకొంది.

వేటకాడు దాని మాటలు విని నవ్వాడు. జింక ఇంటికివెళ్లి తిరిగి వచ్చే మాట అపద్ధమని నమ్మాడు. "కాని ఇంతగా వేడుకొంటూ వుండే దీన్ని వదలిపెట్టడమే మంచిది. అదృష్టముంటే ఈ రోజు నాకు మరో జంతువు దొరక్కపోదు. నా ఆకలి తీరకపోదు." అనుకొంటూ అతడు జింకను వదిలేశాడు.

కొంతసేపటికి పెద్దకొమ్ములు కల అందమైన, వల్లని జింక



నీళ్ళు త్రాగడానికి అక్కడికి వచ్చింది. వేటకాడు దాన్ని చంపడానికని విల్లు ఎక్కుపెట్టాడు. దుప్పి అతన్ని చూసి 'అయ్యా! వేటకాడా! నేను నా భార్యాపిల్లల్ని కలుసుకోవాలి. ఇప్పటికే చాలా ఆలస్యమయింది. వాళ్ళు నాకోసం ఎదురుచూస్తూ వుంటారు. నేను ఓ సారి ఇంటికివెళ్లి, వాళ్లతో మాట్లాడి, వాళ్లకు నచ్చచెప్పి, నీవద్దకు తప్పకుండా తిరిగి వస్తాను. నా మీద జాలిపడి, ఇప్పుడు నన్ను ఇంటికి వెళ్లనియ్యి." దీనంగా పలికింది.

వేటకాడు వినుకున్నాడు. అతడు ఆకలితో నకనకలాడుతున్నాడు. "ఆకలితో అలమటించాలని దేవుడు నా నుదుట రాసివుంటే, అలాగే జరగనీ" అని జాలిపడి జింకను వదిపెట్టాడు.

జింక ఆనందంగా ఇంటికి వెళ్లింది. పిల్లలకు పాలిచ్చింది. తనస్నేహితురాలికి కథంతా వివరించి, పిల్లల్ని అప్పగించాలనుకొంది. ఇంతలో అక్కడికి జింక కూడా వచ్చింది. పిల్లల్ని బుజ్జగించింది. పిల్లలు తల్లిదండ్రులను వదిలివుండలేక పొయ్యారు. వాళ్ల మనస్సు నొప్పించలేక ఆడ, మగ జింకలు వాళ్లతోపాటు వేటకాడి వద్దకు వెళ్లాయి.

చెరువువద్ద వున్న వేటకాడితో జింక ఇలా అనింది "అయ్యా! వేటకాడా! ఇదిగో, మేం వచ్చేశాం. నీవు ఇక మమ్మల్ని చంపి, ఆకలి తీర్చుకో."

జింకల నిజాయితి చూసి వేటకాడు ఆశ్చర్యపొయ్యాడు. అతడు చెట్టుదిగి వచ్చి ఇలా అన్నాడు - "ఈ జింకలు పశువులైనా ఎంత నిజాయితీ కలిగి వున్నాయో! మాట నిలుపుకొనడానికై తమ ప్రాణాల్ని కూడా లెక్కచెయ్యకుండా నావద్ద కొచ్చాయి. మానవుడు అయివుండీ నేను ఎంత నీచుణ్ణి? పాపాత్ముణ్ణి! జానెడు పొట్ట నింపుకొనడానికై, నాలుగు రాళ్ల



సంపాదించుకొనడానికై, అన్నెం పున్నెం ఎరుగని ఈ జంతువుల్ని చంపుతున్నాను. ఈ క్షణంనుంచీ నేను జంతువులను కాని, పక్షులనుకాని చంపను."

వేటకాడు విల్లమ్ముల్ని విరిచిపారవేశాడు. ఇంతలో స్వర్గంనుంచి విమానం దిగి వచ్చింది. విమానంనుంచి దిగివచ్చిన దేవదూత ఇలా అన్నాడు -"వేటకాడా! ఈ జింకలు సత్యాన్ని పాలించడం వల్ల గొప్ప పుణ్యం సంపాదించుకొన్నాయి. ఇవి స్వర్గంలో చోటు పొందాయి. నీవు కూడా వీటిపట్ల జాలిచూపావు. కాబట్టి నీవు కూడా స్వర్గానికి రావడానికి అర్హుడవే. పదండి పోదాం."

ఆడమగజింకలు, జింకపిల్లలు దేవతలుగామారిపొయ్యాయి. వేటకాడు కూడా దేవతగా మారిపొయ్యాడు. సత్యదయాప్రభావాల వల్ల వాళ్లంతా విమానంలో కూర్చొని స్వర్గానికి వెళ్లారు.

నీతి: సత్యం, దయలు స్వర్గానికి మెట్లు.

~~*~~



# 35. ఇతరుల్ని నమ్మవద్దు

ఓ రైతువద్ద ఓ ఆవు, ఓ గుర్రము వుండేవి. అవి రెండూ కలిసి అడవిలో మేసేవి. రైతు పొరుగింట్లో ఓ చాకలి వుండేవాడు. అతనివద్ద ఓగాడిద, ఓ మేకవుండేవి. చాకలి కూడ ఆ రెంటినీ ఆ అడవిలోనే మేసేందుకు పంపేవాడు. నాలుగూ కలిసి మేయుడంవల్ల, వాటి మధ్య స్నేహం కుదిరింది. అవి ఉదయం కలిసిఅడవికి వచ్చేవి. మళ్లీ సాయంకాలం అడవినుంచి కలిసి ఇంటికి వెళ్లేవి.

ఆ అడవిలో ఓ కుందేలు నివసిస్తూ వుండేది. అది ఆ నాలుగింటి స్నేహాన్ని చూసి ఇలా అనుకోసాగింది- 'నేను కూడా వీటితో సఖ్యం చేస్తే ఎంత బాగుంటుందో కదా! ఇంత పెద్ద జంతువులతో స్నేహం చేస్తే ఇక ఏకుక్క భయమూ వుండదు.'

కుందేలు వాటివద్దకు పదేపదే రాసాగింది. అదివాటిముందు గెంతుతూ, ఆడుతూ, వాటితో పాటే గడ్డి మేయసాగింది. నిదానంగా అదివాటికి దగ్గరయింది. ఇప్పుడు కుందేలుకి ఎంతో ఆనందంగా వుంది. కుక్కల బెడద తీరిపోయిందని భావించింది.

ఓ రోజు ఓ కుక్క ఆ అడవిలోనికి వచ్చింది. కుందేలును వెంటాడింది. కుందేలు పరుగెత్తుతూ, పరుగెత్తుతూ ఆవు వద్దకు వచ్చి ఇలా అంది-"గోమాతా! ఈ కుక్క చాలా చెడ్డది. ఇది నన్ను చంపాలని చూస్తోంది. నీవు దీన్ని నీకొమ్ములతో పొడిచి చంపు."

ఆవు ఇలా చెప్పింది -"సోదరా! నీవు చాలా ఆలస్యం చేశావు. నేను ఇంటికి వెళ్లే సమయం వచ్చింది. అక్కడ నాదూడ ఆకలితో నకనకలాడుతూ వుంటుంది. నేను వెంటనే ఇంటికి వెళ్లాలి. నీవు గుర్రం వద్దకు వెళ్ళి అడుగు."

కుందేలు పరుగెత్తుతూ గుర్రం దగ్గరకు వెళ్లి ఇలాఅడిగింది -"అన్నా గుర్రమా! నేను నీ మిత్రుణ్ణి. మనిద్దరం ఇక్కడ కలిసిమేత మేస్తున్నాం. ఈ రోజు ఈ దిక్కుమాలిన కుక్క నా ప్రాణాలు తీయాలని నావెంట పడింది. నీవు నన్ను నీవీపు మీద ఎక్కించుకొని ఎక్కడికైనా దూరంగా తీసుకొనిపో."

అప్పుడు గుర్రం ఇలా చెప్పింది - "నీ మాటేమో బాగానేవుంది. కాని నేను కూర్చోలేను కదా! నేను నిల్చుకొనే నిద్రపోతాను. నీవు నావీపుమీద ఎలా ఎక్కగలవు? నాపిక్కబలం సన్నగిల్లింది. నేను మునుపటిలా వేగంగా పరుగెత్తలేను. కాళ్లు కూడా జాడించలేను."

నిరాశ చెందిన కుందేలు గాడిద వద్దకు వెళ్లింది. 'మిత్రమా! గాడిదా! నీవు ఈ పాడుకుక్కను ఓసారి కాలితో విదిలించి తన్ను. నా ప్రాణాల్ని కాపాడి పుణ్యం కట్టుకో"- అంటూ గాడిదను వేడుకొంది.

అప్పుడు గాడిద ఇలా బదులిచ్చింది - "నేను ప్రతిదినమూ ఆవు, గుర్రంతో కలిసి ఇంటికి వెళ్తాను. అవిరెండూ ఇంటికి పోతున్నాయి. నేను వాటి వెంబడి వెళ్లకుండా వెనకపడితే మా యజమాని కర్రతీసుకొని నా వెంటపడతాడు. బాగా తన్ని ఏ కీలుకు ఆకీలు విడదీస్తాడు. నేను ఇక్కడ వుండలేను బాబోయ్!"

చిట్ట చివరిగాకుందేలు మేక వద్దకు వెళ్లింది. దాన్ని చూడగానే మేక దానితో ఇలా చెప్పింది - 'అయ్యా, కుందేలు సోదరుడా! దయచేసి ఇటు వైపు రావొద్దు. కుక్క నిన్నూ తురుముకొస్తూంది. అదంటే నాకు చచ్చేంత భయం."

అన్ని విధాలా నిరాశచెంది కుందేలు అక్కడినుంచి పరుగు తీసింది.





పరుగెత్తి పరుగెత్తి వెళ్లి అది ఓ పొదలో దాక్కొనింది. కుక్క దానికోసం తెగవెదికింది. కానిలాభం లేకపోయింది. కుక్క విసిగి వెళ్లిపోయింది. అప్పుడు ఊపిరి పీల్చుకుంటూ కుందేలు పొదనుంచి బయటికొచ్చింది. నాలుగు వైపులా నింపాదిగా చూసి 'బతికి బయట పడ్డానురా దేవుడా!' అనుకొనింది. 'ఇతరుల్ని నమ్మితే చెడిపోతాం. మనకు మనమే కష్టపడాలి. అప్పుడే బాగుపడతాం' - అన్న గుణపాఠం నేర్చుకొనింది.

నీతి : ఎవరిపని వాళ్లే చేసుకోవాలి.

—*—

# 36. గర్వ భంగం

సముద్రతీరంలోని ఓనగరంలో ఓ ధనవంతుడైన వైశ్యుని కొడుకులు ఓ కాకిని పెంచుతుండేవారు. వాళ్లు రోజూ తాము తినే అన్నంలో కొంత మిగిల్చి కాకికి పెడుతుండేవారు. వాళ్ల ఎంగిలి మెతుకులు తినే కాకి రుచికరమైన, పుష్టికరమైన భోజనం చేస్తూ బాగా కొవ్వెక్కింది. అది తన కంటే శ్రేష్ఠమైన పక్షుల్ని కూడా లోకువగా చూస్తూ, వాటిని అవమానించేది.

ఓ రోజు ఎక్కడినుంచో ఎగురుతూ వచ్చి కొన్ని హంసలు సముద్రతీరంలో వాలాయి. ఆ వైశ్యుని కుమారులు ఆ హంసల అందచందాల్ని పొగడసాగారు. అది ఆ కాకికి ఏమాత్రమూ నచ్చలేదు. ఆ కాకి వాటిలో అన్నిటికంటే శ్రేష్ఠమైన హంస దగ్గరకు వెళ్లి, దానితో ఇలాఅంది- "నేను ఎగరడంలో మీతో పోటీ చేయడానికి సై"

అప్పుడు హంసలు కాకికి ఇలా నచ్చచెప్పాయి - "తమ్ముడా! మేం వేలాదిమైళ్ల దూరం ప్రయాణం చేసేవాళ్లం. ఇక్కడికి చాలా దూరంగా వున్న మానస సరోవరమే మా నివాసం. మాతో పోటీపడితే నీకేం లాభం? నీవు మాతో సమానంగా ఎగరగలనని ఎలా అనుకొన్నావు?"

కాకి పొగరుమోత్తనంతో ఇలా పలికింది -"నేను నూరు రకాలుగా ఎగరగలను, ఒక్కో పద్ధతిలో నూరు యోజనాల దూరం ఎగరగలను. ఉడ్డీన, అవడీన, ప్రడీన, డీన మొదలైన ఎగిరే విధానాల పేర్లు వరసపెట్టి వల్లిస్తూ వదరుబోతైన ఆ కాకి 'నీవు వీటిలో ఏ పద్ధతి ప్రకారం ఎగరగలవు?' అనిహంసను సవాలుచేసింది.



అప్పుడు ఆ శ్రేష్ఠమైన హంస ఇలా అంది -'కాకీ! నీవు చాలా తెలివైన వాడవు. అన్ని పక్షుల్లాగా ఎగిరే ఒకే పద్ధతి మాత్రమే నాకుతెలుసు. నేను ఆ విధంగానే ఎగురుతాను."

గర్విష్ఠి కాకి గర్వం మరింత పెరిగింది - 'అలాగా! నీకు తెలిసిన విధంగానే ఎగురు' - ఠీవిగా పలికింది.



అప్పుడు అక్కడికి కొన్ని పక్షులు వచ్చాయి. హంస, కాకి వాటి ఎదురుగానే సముద్రం వైపు ఎగిరాయి. ఆ కాకి సముద్రం మీదుగా ఆకాశంలో రకరకాలుగా గిరికీలు కొడ్తూ శక్తి కొద్దీ ఎగురసాగింది. హంసను దాటి వెళ్లింది. హంస సహజంగా మెల్లగా ఎగురసాగింది. దాన్ని చూసి మిగతా కాకులు ఆనందించసాగాయి.

కాకి అలాకొద్దిసేపు ఎగరగానే అలిసి పోయింది. కాస్సేపు విశ్రాంతి తీసుకొందామని చెట్లు చేమలు వున్న ద్వీపాల కోసం వెదకసాగింది. కాని పాపం కాకికి ఎంత దూరం చూసినా

అపారమైన సాగరమే కనపడసాగింది. ఇంతలో హంస ఎగురుతూ వచ్చి కాకిని దాటి ముందుకు పోయింది. కాకి వేగం తగ్గింది. అది బాగా అలిసి పోయింది. ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న అలలతో భయంకర జలచరాలతో నిండిన సముద్రంలో పడిపొయ్యే దీనస్థితి సమీపించింది.

కాకి బాగా వెనుకపడివుండటం గమనించి హంస వేగం తగ్గించింది. అది కాకివద్దకు వచ్చి ఇలాఅంది - "మిత్రుడా! నీముక్కు, రెక్కలు చీటికి మాటికి నీటిలో మునిగి తేలుతున్నాయి. ఈ రకంగా ఎగురడాన్ని ఏమని పిలుస్తారో? కాస్త చెప్పవూ?"

హంస ఎగతాళిమాటలువిని కాకి దీనంగా ఇలా పలికింది -"మిత్రుడా! కావు కావుమని అరవడం తప్ప మాకాకులకు మరేమి తెలియదు. అలాంటప్పుడు వేలాదిమైళ్ల దూరం ఎగరడమా? హవ్వ! నా మూర్ఖత్వానికి తగిన శిక్ష లభించింది. దయచేసి నాప్రాణాలు కాపాడు."

నీళ్లలో తడిసి, స్పృహతప్పిపోతూ, సగం చచ్చినదానిలా వున్న కాకిస్థితి చూసి హంసకు జాలి కలిగింది. హంస కాకిని తన వీపుమీద ఎక్కించుకొని ఎగురుతూ బయలుదేరిన చోటికే వచ్చిచేరింది. హంస కాకిని అది మునుపు వున్నచోట విడిచింది.

**నీతి: హద్దులు దాటితే ఆపదలు తప్పవు.**

~~*~~